# అధ్యాత్మ రామాయణము.

ఈ గ్రంథరాజమును శ్రీశంకరానందస్వాములవారు మూడునాలుగువందలవత్సరములకు బూర్వము హిందీభాషయందు రచించిరి. దానిని వేదాంతవిద్యావాగీశులగు కాళీవరశర్మయను విద్వాంసుడు వంగభాషయందు విపుల మొనర్చియున్నారు. ఆ మహాగ్రంథమును భక్తమనోరంజనార్థమును, భగవదుపాసనకొరకును, ఆంధ్రభాషయందు ముద్రింపించియున్నాము. శ్రీమద్రామాయణమంతయు సులభమగు భాషతోడ వేదాంతపరముగ వ్రాయబడినది. మరియు రామాయణకథయంతయు విస్తరముగ చెప్పబడినది. ఇది యాధ్యాత్మరామాయణమున కనువాదముగాదు. కాని యావద్ధతనే చూపవలయునెంచబడినది. ప్రతియాంధ్రునిచేతియందుండదగిన యీగ్రంథమును మంచికాగితములమీద సలక్షణముగ ముద్రింపించి చక్కని కాలికోబైండు చేయించినాము.

వెల రు. ౧-౮-౦ లు మాత్రము. పోస్టు ఖర్చులు కొనువారలే భరింపవలయును.

కార్యనిర్వాహకుడు,
సరస్వతీనికేతనము,
మచిలీపట్టణము, కృష్ణాజిల్లా.

ఓం

# వాల్మీకి విజయము



ప్రథమ ముద్రణము

మచిలీపట్టణములోని
"సరస్వతీనికేతనము" వారిచే
ప్రచురింపఁబడినది.

చెన్నపురి:
కలోనియల్ ముద్రాలయమున
ముద్రితము.

౧౯౧౯

 వెల రూ. ౦-౧౦-౦

## అంకితము

సత్యవ్రతులును, దేశసేవానిరతులును, నాకు మిత్రులు నగు అయ్యదేవర కాళేశ్వరరావుగారికి గ్రంథమును సమర్పించుచున్నాను.

గ్రంథకర్త.

శ్రీ

# వాల్మీకి విజయము

## మొదటి ప్రకరణము

-----

### హిమాలయము

వర్షములు పూర్తియయ్యెను. శరదృతువు ప్రారంభించెను. ఆకాశము నిర్మలముగ నుండెను. అందణుమాత్రమైనను మేఘములు లేవు. వర్ణనాతీతమును, మనోమోహనకారియు నగు, నీల-సునీల-సుగాఢనీల వర్ణముల సౌందర్యదీప్తుల నలరారునభోమండలమునఁ బెద్దపెద్దనక్షత్రములు జాజ్వల్యమానముగ వెలుంగుచుండెను. ఆతారకాగణమధ్యమందు "ఛాయాపథము" ఆకాశమును ద్విభాగములుగ నొనర్చి తానుగూడ భాగింపఁబడెను. భూమియందలి బురద యెండిపోవుచుండెను. వృక్షములు లతాగుల్మములు కడుఁదేజమునఁ బెరుగుచుండెను. చక్కని యాకుపచ్చరంగువలన పృథ్వియొక్క నవయౌవనము ప్రకటితమగుచుండెను. మీఁద సుగాఢనీలిమ;

క్రింద దట్టమగు నాకుపచ్చనివర్ణము. ఈ రెండును గలియుచోట నొక చట్టమునందు రెండు పెద్ద చిత్తరువులఁ జిత్రించి ప్రేక్షకులకు వానిమధ్యమునం దొకింత స్థానమును వీడినట్లు గన్పట్టుచుండెను.

ఆకాశము నిర్మలమును, నిర్మేఘమును, ధూళి సంపర్కరహితమునై యున్న యట్టికాలమందు నా మనోహర శరత్కాలమందు, హిమవన్నగమధురి మను నెవ్వరైన వీక్షించినారా? ఒకదిక్కున భారత వర్షముయొక్క సమభూమి శతయోజనవ్యాప్తమై కన్పట్టుచుండును. రెండవప్రక్కను పర్వతపంక్తులు, వానిమీఁద పర్వతపంక్తులు, వానిపైని పర్వతపంక్తులు, వానిమీఁద చాలదూరమువఱకు వ్యాపించినహిమవన్నగములఁ జూచితిరా ? రాజపుత్త్రుని యాగమనమువలన విశాలనగరరాజములు నానాదీపమాలికలచేత నలరారుచుండువిధమున నాశ్వేత హిమవన్నగములమీఁద సూర్యకిరణములు పడి తళతళ ప్రకాశించుచుండుటను గాంచినారా? పూర్వపశ్చిమములఁ దిలకించినయెడల కేవలము శిఖర

ములమీఁద శిఖరములు, వానిపైని శిఖరములు గనఁబడుచుండును. కాని యాశిఖరముల కంతము లేదు; విరామము లేదు. అందువలన వాని ననంతము లని చెప్పినను చెప్పవచ్చును.

వర్షము లప్పుడే యాఁగినవి. నలువైపులనుండి సెలయేఱు లతివేగమునఁ బాఱుచుండును. అందలి జలము పాలనురుగులను మించినధవళకాంతుల నీనుచుండును. ఆయేఱులయం దచ్చటచ్చట సూర్యరశ్మివలన నింద్రధనుస్సులు పొడగట్టుచుండును. కొన్ని సెలయేఱు లనంతకాలమునుండి చిరాంధకారమం దలక్షితములై ప్రవహించుచుండును. కాని వానిని చూచినవాఁ డెవ్వఁడును లేఁడు. అయినను వానిగతికి విరామము లేదు. సెలయేఱు లున్నస్థలములు నానావృక్షములతోడ నిండి నిబిడీకృతమై యుండును. కాని సెలయేఱులు లేనిస్థలములయందు భయంకరాకారము లగురాతిబండ లుండును. వానిని సమీపించిన దొర్లి మీఁదఁ బడునేమో యను భీతి గలుగుచుండును. ఒకచో నత్యున్నత ప్రదేశము

లును, వాని నంటియే యతిగంభీర మగులోయ లును గనఁబడును. కాని యాలోయలయట్టడు గొ క్కడ? చూచుటకు వీలు లేదు. కాని చూఁడగలి గినయెడల నం దొక చిన్న నది పాఱుచుండును. అంద లిజల మిరువైపుల నుండురాళ్లపై కెగసి క్రిందికి జాఱుచు నృత్యము సల్పుచుఁ బ్రవహించుచుండు ను. అచ్చటచ్చట నీరస-కఠినతరువరములు వేలకొ లఁదివత్సరములనుండి కాలముతోడఁ బోరాడుచు నాత్మరక్షణను జేసికొనుచుండినట్టులు గాంచఁ గలము. వానిని సోమలత లనేకచుట్లు జుట్టుకొని యయిదారువందలవత్సరములనుండి జీవించుచుండి నటులు గ్రహింపఁగలము.

నేఁడు నీ వెట్లు హిమాలయపర్వతమును జూచు చున్నావో యనంతకాలమునుండి యది యావిధ ముగనే యున్నది. మంచుకొండ లట్లే యున్నవి. సెల యేఱు లొక్కవిధముగనే ప్రవహించుచున్నవి. ఆ కాశ మదేవిధముగ దట్టమగు సునీలకాంతులతో విరాజిల్లుచున్నది. మఱియు సమస్త మావిధముగనే

యున్నది. శరత్కాలమందు హిమాలయపర్వతము గంభీరముగ నుండును-అయినను మనోహరముగ నుండును. భయంకరముగ నుండును-కాని యున్మాదకర మగు సౌందర్యమున నలరారుచుండును. నే నిప్పుడు కృతత్రేతాయుగములసంధికాలమం దొక యమావాస్యరాత్రిని వర్ణించుచున్నాను. ఆరాత్రి హిమవత్పర్వతరాజ మపూర్వసౌందర్యమునఁ జెన్నారుచుండెను.

## ఋభువులు

మానవుఁడు మరణించినపిమ్మట నే మగును? ఎవరు చెప్పఁగలరు? కొందఱు భూత మగు నందురు. మఱికొందఱు తమతలిదండ్రులు స్వర్గమున కేఁగినారని నుడువుదురు. కాని వేదమత ప్రకారము వారు స్వర్గమున కేఁగరు. పృథ్వియందు సత్కర్మ లొనర్చినవారు ఋభువు లగుదురు. వా రెచ్చట నుందురు?—ఏమి చేయుదురు?—అనువిషయ మెవ్వరు చెప్పఁగలరు? కాని వారు ఛాయాపథమున కావలి

యొక్తున నేదో యొకసుఖనుయభవసమున నివ
సించుచుందురు.

ఆశరత్కాలమందలి యమావాస్యరాత్రియం
దు ఛాయాపథ మాకస్మికముగ చీలి రెండుపాయ
లయ్యెను. దానినుండి యసంఖ్యాకు లగుఋభువులు
వెలుపలకు వచ్చిరి. వారిశరీరకాంతులవలన బ్రహ్మాం
డ మంతయుఁ బ్రకాశింపఁజొచ్చెను. ఆ తేజమందు
నక్షత్రకిరణము లంతర్హితము లై యాకాశపటము
నం దంకితములైనచిత్తరువులఁ బోలి విరాజిల్లు
చుండెను. ఋభువు లొక్కముహూర్తకాలమున
నాకాశపథము నతిక్రమించిరి. పక్షు లాకసమునం
దు బారులు తీరి విహరించునప్పు డెంతో సుంద
రముగ నుండును. అటులే తీవ్రజ్యోతిర్మయు లగు
నాఋభువులు శరీర ప్రభలచే దిగంతములు వెలుం
గఁ జేయుచు నాకాశపథమును గప్పి తండోపతండ
ములుగ భూలోకమునకు వచ్చుచుండిరి. వారినిఁ
గాంచి మానవు లాశ్చర్యాన్వితచిత్తు లై కొందఱు

ధూమకేతు వుదయించిన దనియు, మఱికొందఱు నక్షత్రములు రాలుచున్న వనియు నుడువసాగిరి.

ఆనాఁడు ఋభువులు జన్మస్థానసందర్శనార్థము బయలుదేఱిరి. అందువలన వారు భారతవర్షమును సమీపించినకొలంది నానందమును బొందుచు, నిమేషకాలమున హిమవత్పర్వతమును బ్రవేశించిరి. అచ్చట వా రొకపర్వతమునుండి మఱియొకపర్వతమున కేఁగి యొకశిఖరమునుండి మఱియొకశిఖరమును జేరి మహానందమున గానముఁ జేయసాగిరి. కాని మానవు లాగానార్థమును గ్రహించు టెట్లు? కర్ణరసాయనం బగు నాస్వరములవలన జగత్తంతయు ముగ్ధమాయెను. భూమ్యాకాశములు నిస్తబ్ధతను జెందెను. నక్షత్రము లచలము లయ్యెను. ఛాయాపథము నిశ్చలముగను నిష్పందముగను నుండెను. బ్రహ్మాండ మంతయు స్తంభితమై కదలక మెదలక మహామోహనిద్రాపారవశ్యతను జెందిన ట్లాయెను. ఋభువు లాగానము నొక్కస్వరమున నొక్కతాళమునఁ బాడసాగిరి. ఆగీతధ్వని బ్రహ్మాండభాం

డోదరమంతటను నిండి యున్నరక్తచ్ఛాయాపథమున ననంతమందు విలీన మగుచుండెను.

పృథ్వి - ఆకాశ - బ్రహ్మాండ-అనంతములయందు నివసించుచున్న జనసమూహము ముగ్ధులై యాగానమును వినుచుండిరి. వారికర్ణపుటముల నాగానము సుధాధారాతుల్యముగఁ బడుచుండెను. సంతోష సమయములయందు సుఖసంతానమును గాంచినటులును సుస్వప్నమును దిలకించినటులును సగము చేతనమును సగ మచేతనమును మోహమయమును సుఖమయమును శాంతిమయమును అమృతమయమును నయి దూరస్థమధురసంగీతధ్వనివలెను, కర్ణముల యందే దియో విలీనమగునటు లాగీతధ్వని యెల్లర శ్రోత్రములఁ బడుచుండెను. కాని యెవ్వరును తమ ప్రాణ ప్రఫుల్లతకు కారణ మరయఁజాలకుండిరి. అయినను నెల్లరా గానమువలన ముగ్ధులైరి.

ముగ్గురుమాత్రమే యాగీతార్థమును గ్రహింపఁగలిగిరి. ఉన్మత్తులైరి. వెంటనే వా రాస్వరమును లక్ష్యమందుంచుకొని హిమవన్నగశిఖరమును

జేరిరి. ఆమువ్వురును భారతవర్షమునకు చూడామణులు. భారతవర్షమున్నంతవఱకును, హిందూధర్మము విరాజిల్లుచుండుదనుకను, జగత్తునందు మహాత్ములు గౌరవింపఁబడుచుండువఱకును వారినామధేయములు మానవమండలియందు దేదీప్యమానములై వెలుంగుచుండును.

## మూర్తిత్రయము

వారిలోఁ బ్రథముఁడు వసిష్ఠమహర్షి. అతఁడు తనయాశ్రమమం దఱువదివేలమంది శిష్యులకు ధర్మమును జ్ఞానమును నీతులను నుపదేశించుచుండెను. కొందఱకు వాచ్యము, వాక్యము, వ్యంగ్యమును; మఱికొందఱకు ప్రమాణము, ప్రమేయము, ప్రయోజనము, సంశయము, నిర్ణయము, చల-జాతి-హేత్వాభాసము- మొదలగుగూఢతత్త్వములను మఱికొందఱకు పంచతన్మాత్రలతోఁ గూడిన లింగశరీరముయొక్క భేదాభేదములను కొందఱకు వివర్తవాదమును మఱికొందఱకు పరిణామవాదమును బోధములు చెప్పుచుండెను. కొందఱకు గోమేధము

అశ్వమేధము రాజసూయము అగ్నిష్టోమము గోష్టో
మము జ్యోతిష్టోమము మొదలగుయజ్ఞములశిక్ష
నొసంగుచుండెను. అధికారిభేదము ననుసరించి కొం
దఱకు దశకర్మలశిక్ష నొసంగుచుండెను. అప్పు డా
యనశిష్యులెల్ల రాకస్మికముగ నేకాగ్రమనస్కు
లై, స్థిరులై, స్పందనరహితులై చివరకు మంత్ర
ముగ్ధులం బోలివాక్శక్తివిహీనులైరి. ఆగీతాని
నాదము వసిష్ఠమహర్షికర్ణములయందుఁ బ్రవేశించె
ను. ఆతఁడు యోగశక్తివలన ఋభువులు వచ్చి
రని తెలిసికొని హిమాలయపర్వతశిఖరముల లక్ష్య
ముం దుంచుకొని యోగబలమున నాకాశమా
ర్గమున నిర్గమించెను. ఒక్కముహూర్తకాలములో
నచ్చటి కేగి ఋభువులకు నమస్కరించి ఆ దేకనిష్ఠ
తోడ గానమును వినుచుండెను.

ద్వితీయుఁడు విశ్వామిత్రుఁడు. ఆతఁడు చతురం
గబలసమేతుఁడై దిగ్విజయమునకు బయలుదేఱి
యొకసాయంకాలమున హిమాలయపదప్రదేశమం
దు శిబిరమును స్థాపించెను. మార్గాయాసమువలన

సైనికులు స్థలము దొరకినచోట నెల్ల డేరాలను నిర్మించుకొనుచుండిరి. విశ్వామిత్రుఁడు కొంతమంది మంత్రులతోఁ గూడి యచ్చటికి సమీపమం దున్న యొకచిన్న సెలయేటియొడ్డునఁ గూర్చుండి మఱుదిన మేదిక్కునకు సైన్యమును నడిపింపవలయు ననువిష యమునుగూర్చి యాలోచించుచుండెను. అప్పు డా కస్మికముగ నాకాశము వెలుంగఁజొచ్చెను. అనుమ ధురగీతానినాద మెల్లర శ్రోత్రములయందుఁ బ్రవే శించెను. సైనికు లెచ్చటివా రచ్చటఁ గదలక మెద లక సుఖమోహపరవశు లై యుండిరి. డేరాల నమర్చుచున్నవా రా గానమును వినుచు స్వకార్య ముల మఱచి యటులే నిలుచుండిరి. ప్రక్కలు పఱచుకొనువా రా సంగీతమును వినుచు నటులే వంగియుండిరి. విశ్వామిత్రుఁ డాగీతార్థమును గ్రహిం చెను. వెంటనే త్రివిక్రమునిఁ బోలి మూఁడడుగుల లో హిమవత్పర్వతశిఖరముమీఁది కేఁగెను. అతఁడు వచ్చుటవలన ఋభువులు కృష్ణవర్ణమును ధరించిరి.

కాని దానిని విశ్వామిత్రుఁడు చూచియుఁ జూడజాలకుండెను.

తృతీయుఁడు వాల్మీకి. ఆతఁడు దొంగలగుంపుతోఁ గూడి గిరిరాజసౌధమును కొల్లగొట్టుట కేఁగియుండెను. వాల్మీకి స్వయముగ రాజభవనము మీఁది కేఁగి నలుగురైదుగురుదొంగలను పైకిఁ దోడ్కొని పోయి మెట్లను పగులగొట్టుచుండెను. అప్పుడు నలుదిక్కులనుండి సైనికులకేకలు వినఁబడఁజొచ్చెను. కాని రక్షకభటులయం దెవఁ డెచ్చట కేఁగవలయు నను విషయమును నిర్ణయించుకొనుట కవకాశము లేదయ్యె. అందువలన నొకచోట రాజభటులు దొంగలను, మఱియొకచోట దొంగలు రాజభటులను, నొకచోట రాజభటులు రాజభటులను నింకొకచోట దొంగలు దొంగలను నఱుకుకొనుచుండిరి. వాల్మీకి కరవాలమును గిరగిర ద్రిప్పుచు సంకేతసూచకముగ శంఖమును బూరించెను. అప్పు డాకాశము కాంతియుత మయ్యెను. ఋభువుల గీతానినాదము వెల్వడెను. అప్పు డేభావ

మాన నున్నవాఁ డాభావమునఁ జిత్రపుఁబుత్తలికలఁ బోలి కదలక మెదల కుండిరి. వాల్మీకి యాగాన మును వినెను. దానియర్థమును గ్రహించెను. వెం టనే యస్త్రిత్యాగ మొనర్చి క్రిందికి దుమికి ప్రక్క నున్న పర్వతశిఖరముమీఁది కేకెను.

## భ్రాతృగీతము

గానమువలన ముగ్ధుఁడు గానివాఁ డెవ్వఁడు? సామాన్యు లగుమానవగాయకులు గూడ శ్రుతిల యసమ్మేళనం బొనర్చి సంగీతమును బాడునప్పుడు ముగ్ధుఁడు గానివాఁ డుండఁడు. కాని యంతకంటెను మానసోల్లాసమున ప్రాణమునుండి బయల్వెడలు గాన మత్యంతమధురముగ నుండు ననుటకు సందే యము లేదు. మఱియు నాగీతార్థముఁ గ్రహించిన వాఁడు ముగ్ధుఁ డగును. దానిభావమును దెలిసికొని నవాఁ డంతకంటెను పరవశుఁ డగును. కేవల మా గీతము శ్రోత్రపుటముల నిండుటయే కాక మన మంతటను నిండినయెడల నాతఁ డున్మత్తుఁ డగును.

నేఁడు మహాగాయకు లగు ఋభువులు జన్మ భూమిసందర్శనమువలన పులకాంకురితు లై హృద యోల్లాసమున సంగీతమును బాడఁజొచ్చిరి. మఱి యు వారు చతుస్సముద్రతరంగబాహువులవలనఁ గడుగఁబడుచున్న పాదములతోడను, చిరనీహారధవ ళోన్నత మగుశిరస్సుతోడను విరాజిల్లుచు, ప్రాక్త నమును సుజలమును సుఫలమును నగు జన్మభూమి ననేకదినములకు మఱల సందర్శించిరి. అందువలన వారియానందమున కడ్డులే కుండెను. వసిష్ఠ విశ్వా మిత్రవాల్మీకు లాయపూర్వగానమును వినుచుండిరి. గ్రహించుచుండిరి. భావమును గ్రోలుచుండిరి. ఆగా నము వారికర్ణములు, మనస్సు ప్రాణమునం దంత టను నిండి పొంగి పొరలుచుండెను. బాహ్యేంద్రియ ములు కర్ణరంధ్రములయందుఁ బ్రవేశించెను. మనః ప్రాణములు శ్రోత్రములయందుఁ జొచ్చెను. అందు వలన వారు జ్ఞానశూన్యు లైరి—చైతన్యవిహీను లైరి. ఆముప్పురుగాయకులఁ గాంచి ముగ్ధు లైరి. గానమునకు ముగ్ధులైరి. స్వరమునకు ముగ్ధు లైరి.

స్వరభావమునకు ముగ్ధులైరి. స్వరము హెచ్చిన కొలఁదిని "అన్నా! అన్నా!" యని వినఁబడుచుం డెను. ఋభువులు చేతులు చాఁచి స్థావర జంగమ భూచర ఖేచర జలచరము లన్నింటినిఁ గాంచి "రా అన్నా! రా మనమందఱము సోదరులము" అని పిలుచుచుండిరి. స్వరము హెచ్చి దట్టమైనకొలఁదిని "అన్నా రా? మన మందఱము సోదరులము" అను పిలుపు పరిస్ఫుట మగుచుండెను.

"అన్నా! అన్నా!" యనుధ్వనితోడ జగత్తంత యు నిండిపోయెను. బ్రహ్మాండమునుండి "అన్నా" యని ప్రతిధ్వనింపఁదొడంగెను. ఆయపూర్వగానము మోహినీరూపమున వారి యింద్రియముల స్తబ్ధ మొనర్చి హృదయములఁ గరఁగించి "అన్నా! అన్నా!" యని పల్కుచుండెను. అం దొకఁడు పండితుఁడు. మఱియొకఁడు దిగ్విజయుఁడు. మూఁడవ వాఁడు దొంగ. కాని యొకనిమేషకాలము వారి మనముల నాశ్రయించియున్న విరోధభావము లంత ర్ధానము లయ్యెను. అందువలన నెల్లర మనః

ప్రాణము లోక్కొతాళమున "అన్నా! అన్నా! మన మందఱము సోదరులము" అని పాడుచుండెను.

గీతానంతరము

వారు ముగ్వురు నున్మత్తులైరి. కాని వారి మన స్సునం దతిరహస్యముగను మెల్లమెల్లగను నొక్క భావనాస్రోతము ప్రవహించుచుండెను. కాని యీ ముగ్వుర గానోన్మత్తతను తీవ్రగామి యగు చింతా స్రోతము గూడ భంగపఱుపఁజాల కుండెను. అందు వలన హృదయాంతర్గతమునఁ బ్రవహించు చిన్న భావనాస్రోతమును వా రెఱుంగకుండిరి. ఆగానము వలన తన్మయు లయినముగ్వురును తన్మయులుగనే యుండిరి. కాని లోలోపల వారిహృదయములు కరఁగుటవలన క్రమక్రమముగ మఱియొకరూప మును బొందిరి.

వసిష్ఠునిమనమునం దాత్మప్రసాద ముండెను. "నేను బ్రాహ్మణుఁడను. బ్రాహ్మణక్షత్రియులవివాద ములను బరిష్కరించితిని. అందువలన నెల్లరను సో దరులనుగ నొనర్పగల్గితిని" యని తలంచుచుండెను.

విశ్వామిత్రునిమనమునం దాత్మగరిమ యుండెను. "నేను బాహుబలముచేఁ బృథ్వియంతయు జయించి యేకముగ నొనర్చితిని. నాశాసనమువలన నంద ఱును సోదరు లగుదురు" అని యనుకొను చుండెను.

వాల్మీకి ఘోర మైన యాత్మగ్లానియందు మునిం గెను. "అయ్యో నే నేమి చేసితిని? ఎట్టిదుష్కా ర్యము లొనర్చితిని? కేవలము సోదరుల సర్వనాశన మొనర్చితిని గదా!" యని పరితపించుచుండెను.

కాని నాముగ్వురియం దెవ్వరును హృదయ మందుఁ బ్రవహించుచున్న భావనాశ్రోతమును గమ నింప రైరి.

## ఋభువుల నిర్గమనము

ఋభువులు కొన్నినిముసములు మాత్రము హి మాలయ పర్వతశిఖరములయం దుండి మరల నాకాశపథమున బయలుదేఱిరి. అప్పుడు వశిష్ఠ విశ్వామిత్రులకు రాశిచక్ర మన్యపథమునఁ దిరుగు చున్నటులు గాన్పించెను. ఋభువులు దూర మైన

కొలఁదిని లక్షలకొలఁది నూతననక్షత్రములు పుట్టు చుండెను. కాని క్రమక్రమముగ నానక్షత్రములు గూడ నంతర్హితమాయెను. పిమ్మట నాకాశ మొక తెల్లని మేఘమువలన నాచ్ఛాదింపఁబడెను. వరుసగ మేఘములు ఛాయాపథగర్భమందుఁ బ్రవేశించెను. ద్వాపరయుగాంతమందు విరాట్స్వరూపుఁ డగు శ్రీమన్నారాయణుని ముఖమునందు సమస్త బ్రహ్మాండములు పడిపోవుటను నర్జునుఁడు గాంచినట్లు ఛాయాపథము సమస్తబ్రహ్మాండములను మ్రింగుచుండు టను వారు చూచిరి. క్రమముగ శ్వేతమేఘపుంజములు ఛాయాపథమందు విలీన మయ్యెను. అందువలన ఛాయాపథమందలి మధ్యగహ్వరము నిండిపోయెను. పిమ్మట ప్రపంచ మెప్పటివలె నుండెను. నక్షత్రములు వెలుంగఁజొచ్చెను. ఆకాశము స్థిరమాయెను. మఱియు సుకోమల నీలకాంతుల విలసిల్లఁజొచ్చెను. పృథ్వియందు ప్రభాత మాయెను. కోకిలలు కాకములు కూయఁదొడంగెను.

వసిష్ఠవిశ్వామిత్రవాల్మీకు లింతదనుకను తదేక దృష్టితోడ నత్యంతాశ్చర్యముగ ఛాయాపథమును దిలకించుచుండిరి. ఋభువు లేఁగినంతనే వారు నిరాశను జెందిరి. కాని అప్పుడును "అన్నా! అన్నా! మనమందఱము సోదరులము" అనుగీతము వారి కర్ణములయం దొకేవిధముగఁ బ్రతిధ్వనించుచుండెను.

వారి కింతవఱకు నణుమాత్రమైనను గోచరింపని చింతాప్రవాహము క్రమక్రమముగ నుద్దామరూపమును దాల్చెను. అప్పుడు బాల్యయౌవనములును ప్రాచీననవీనత్వములును, స్వార్థ-నిస్వార్థములును మొదలగు నానావిధప్రబలవిరోధభావతరంగము లొక్క-మాఱుగ వారి మనోరంగమునం దుదయించి అతీంద్రియ ఆధిదైవిక భావముల మిళితమై వారిమనములయందు ఘోరసంగ్రామ మొనర్పఁజొచ్చెను. అందువలన కొన్నినిముసములదనుక వారు లేచి యెచ్చటకేఁగుటకును శక్తి లేనివారైరి. కాని "మన మందఱము సోదరులము. అన్నా! అన్నా!" అనుగీతము వారి వీనులయందు మాఱుమ్రోఁగుచుండెను.

## చింతనలు

వసిష్ఠమహర్షి "ఆహా! బుద్ధిమహిమ యపారము గదా!" అని యొకమాఱును "క్షత్రియుల మోస పుచ్చితిని" అని వేఱొకమాఱును, "క్షత్రియ బ్రాహ్మణులను నేకముగ నొనర్చిన నేను మిగిలినజాతులను గూడ గలుపఁజాలనా!" అని మఱియొకమాఱును దలంచుచుండ "అన్నా! అన్నా!" యను గాన మా తనివీనులయందు మాఱు మ్రోఁగఁజొచ్చెను. అప్పుడు మరల నిట్లు భావించెను. "సర్వశాస్త్రముల వశపఱచుకొంటిని. కాని తేజ మన నేమి? స్వకార్య ముద్ధరేత్ - అని శాస్త్రములు నుడువుచున్నవి. కావున మానాభిమానములఁ గోడఁ బని యేమి? పౌరోహిత్య మత్యంతలాఘువ మనుమాట నిజము. కాని శక్తియంతయు బ్రాహ్మణహస్తగత మైయున్నది. అందువలన మానవుల నందఱ నొక్కమాట యాండించితిని. అందుకొఱకే సంహితను రచించితిని. యోగశాస్త్రమును వ్రాసితిని. మానముగాని లేక యవమానము గాని కార్యమును సాధింతును. స

ధింపఁజాలనా? తేజము, సత్యము, ధర్మము, మొదలగున వన్నియు నసత్యములు. ఒక్క కార్యము మాత్రమే సత్యము. కావున కార్యమును చేయఁజాలనా? ఋభువు లేల వచ్చిరి? అహో! ఎట్టిగానము? ఎట్టిభావము? నే నట్లు చేయఁజాలనా? మరల వారి దర్శనం బైనయెడల "అన్నా! అన్నా! యని నేను బ్రత్యుత్తరం బొసంగుదును. దానికి నాబుద్ధి ప్రాభవమును శాస్త్రబలమును జాలవా? చాల కేమి?" అని తలంచుచుండ "అన్నా. అన్నా." అనుగీత మాయన కర్ణరంధ్రములఁ బ్రవేశించెను.

విశ్వామిత్రుఁ డిట్లు భావింపఁజొచ్చెను. "ఆహా. వారు ఋభువులు. ఎట్టిగానము! ఎట్టిరూపములు. అహో! ఏమి నాసౌభాగ్యము! ఏల కాదు: నేను గూడ నావిధముగ నొకదినమున మత్తుఁడ నగుదును. ఋభువుల కిట్లు ప్రత్యుత్తరం బొసంగుదు. 'అహం విశ్వామిత్రః.' జగత్తంతయు జయింతును. కాని దానికి నన్నడ్డగించువాఁ డెవ్వఁడు? సమస్తమిహాస్త్రములతోడనే చేయుదును. పిమ్మట నందఱుఁ

గలుపుదును.” అని యనుకొనుచుండ వాని కర్ణ
ములయందు “అన్నా! అన్నా!” యను గీతము
ధ్వనింపఁదొడంగెను. అప్పుడు మరల విశ్వామిత్రుఁ
డిట్లు భావించెను. పృథ్వియందు దండచేతను “అ
న్నా! అన్నా! యని పాడింపఁగలిగినప్పుడే గదా
నాపేరు విశ్వామిత్రుఁడు? ఆపని చేయఁజాలనా?
ఆకార్య మొనర్పఁగలశక్తి నాహస్తద్వయమునకు
లేదా!”

వాల్మీకి యిట్లు దలంచుచుండెను. “అయ్యో!
ఎన్నిహత్య లొనర్చితిని? ఎంతమంది యభాగ్య
కాండను విధవల నొనర్చితిని. ఆమహాపాతక మెట్లు
పోవును? ఆపాపాగ్నిజ్వాల లెట్లు చల్లారును? ఋషు
వుల దర్శించితిని. వారిగానమును వింటిని. అందు
వలన నాహృదయము దహించుకొనిపోవుచున్నది.
కావున నేను వారితోడ నున్మత్తుఁడను గాఁజాల
నైతిని. అయ్యో! నే నేల మానవుఁడ నై పుట్టి
తిని? నన్నుఁ జూచినంతనే మానవులు పలాయితు
లగుచుండ నిం కెక్కడ సోదరత్వము? ఓ దేవా!

నా కేల యీ క్రూరవృత్తిని విధించితివి?" ఇట్లు పరితపించుచుండ, 'అన్నా. అన్నా!' యనుగానము క్రమ్మఱ నాతనికి కర్ణగోచర మయ్యెను. అప్పుడు వాల్మీకి వక్షఃస్థలము కన్నీటిధారలవలనఁ దడియసాగెను. "అయ్యో! నే నెట్టిపాపకార్యము లొనర్చితిని? ఆస్మృతిని మఱచు టెట్లు? అవి శాంతించు టెట్లు?" అని భావించుచుండ కన్నీరు కాల్వలై పాఱసాగెను.

ఫలితములు

ఆముగ్గు రెంతదనుక హృదయవేదనను బొందుచుండిరనువిషయమును గూర్చి చెప్పు టెట్లు? ఋభుప్రదత్త మగు నానూతనవిద్యుచ్ఛక్తివలన వారి హృదయాకాశమందు వీచిన తుపానునుగూర్చి వర్ణింపఁగలవాఁ డెవ్వఁడు? క్రమక్రమముగ వారికి భావశాంతి గలిగెను. బాహ్యవస్తువు లింద్రియగ్రాహ్యము లాయెను. అప్పుడు సమస్తపదార్థము లన్యరూపమునఁ గనఁబడఁజొచ్చెను. ఆ శరదాకాశమందు సూర్యోదయ మాయెను. నక్షత్రము లెచ్చ

టనో డాఁగుకొనెను. ప్రభాతవాయువు మనో ల్లాస మొనర్చుచుండెను. సెలయేళ్ల ప్రవాహానినా దములు వీనులవిందు గొల్పుచుండెను. ఆముష్క్రార కారాత్రి వృత్తాంతము స్వప్నతుల్యముగఁ బొడగట్ట సాగెను.

ఆభావాందోళన మాగినంతనే వసిష్ఠుని మనము నందు శాంతియు సుఖమును గోచరించెను. మఱియు నాతఁడు విద్యా-బుద్ధి-తపోబలములవలన పృథ్వియం దంతటను సోదరత్వమును స్థాపించెద నను ఆశా ప్రతిజ్ఞలతోడ గర్వపూరితుఁ డాయెను.

విశ్వామిత్రునకు మిక్కుట మగు నాత్మగరిమ యుండెను. కాని యాయనమనమునం దొకింతభయ ముండెను. "నేను బాహుబలమువలన దాదాపుగ జగత్తు నంతను జయించితిని. మిగిలిన దానినిఁగూడ "జయించి సోదరభావమును నెలకొల్పుదును" అని చింతింపఁదొడంగెను.

వాల్మీకికి శాంతి లేదు; సుఖము లేదు. అధి కానుతాపమున మునింగి యుండెను. అందువలన

నాతఁడు దొంగలగుంపుకడ కేఁగక రోదనముఁ జేయుచు శాంతిని బొందుటకుఁగాను నిబిడారణ్యములకేఁగెను.

వసిష్ఠుఁడు హృష్టచిత్తమున ప్రాతఃకాలకృత్యములు నివర్తించుకొనుటకు తపోవనమునకు బయలుదేఱి యాకాశపథమున నిర్గమించుచు, మార్గమందు దివ్యతేజఃపుంజమునఁ బ్రకాశించు శరీరముతోడను విశాలవక్షఃస్థలముతోడను విరాజిల్లుచున్న విశ్వామిత్రునిఁ గాంచెను. ఆయన పదభరమువలన పృథ్వి కంపించుచుండెను. అంత వసిష్ఠుఁడు సంతోషాంతరంగితుఁడై యోగబలమున విశ్వామిత్రుని సమీపించెను. ఇర్వురును పదవ్రజమున పర్వతమును డిగ సాగిరి.



శ్రీ

# వాల్మీకి విజయము

## రెండవ ప్రకరణము

### సమాగమము

వసిష్ఠవిశ్వామిత్రులు హిమవన్నగమునుండి దిగుచుండ వారిపదభారమునకు పర్వతము కంపింపఁజొచ్చెను. మఱియుఁ గ్రుంగుచుండెను. సమ్ముఖమందలి శిలాఖండము లిటునటు దొల్లి వారికి మార్గము నిచ్చుచుండెను. వృక్షరాజములు, శాఖాప్రశాఖలఁ జాచి వారిని సన్మానించుచు ఛాయాదానమువలన వారిశరీరముల సుస్నిగ్ధములుగ నొనర్చుచుండెను. ఆవృక్షశాఖలమీఁద నున్న సుపుష్టమును సుహృష్టమును సుకంఠమును విచిత్రపక్షములును నగుపక్షులు సుమధురగీతముల వారికి కర్ణానంద మొనర్చుచుండెను. వృక్షాగ్రములనుండి లతలు వారిమీఁద పుష్పవర్షమును గురిపించుచుండెను.

వారికి ప్రతిపదమునందునను కలకలనినాదమున సెలంగు సెలయేఱులు తరంగహస్తములపద వార్జనం బొనర్చుచుండెను. సుకోమల కాయమున నల రారు గుల్మములు సుశీతల-సుగంధ-సుమంద-పవన హిల్లోలముల నాందోళితములగుచు వింజామరలై వారికి విసరుచుండెను. అతిదుర్గమములును దురారోహములు నగుపర్వతసానువుల వారవలీలగ దిగుచుండిరి. పశ్చాద్భాగమం దభ్రభేద్యము లగుపర్వతమాలలును, నిమ్నభాగమందు తృణాచ్ఛాదిత మగు సునీలసమతలభూమియు నాకోటిమధ్యను తేజోమయు లగువసిష్ఠవిశ్వామిత్రు లలరారుచుండిరి. ఆఋషుల దీర్ఘోన్నతశరీరములు పర్వతశిఖరములను ధిక్కరించుచుండెను. మఱియు సూర్యకిరణములు ప్రతిఫలించుచున్న తీవ్రోజ్జ్వలతుషారమండితశిఖరద్వయము స్థానచ్యుతమై సమగతిని నిమ్నాభిముఖముగ పతితమగుచుండినటుల గన్పట్టుచుండెను.

ప్రథమదర్శనమున వారిర్వురు పరస్పరాలింగనమును వందనముల నాచరించుకొనిరి. పిమ్మట వసి

ష్ఠుఁడు ఉదాత్త అనుదాత్తములతోఁ గూడిన స్వర ప్రక్రియాపరిశోధిత మగుకోమలమును స్నిగ్ధమును గంభీరమును నగుస్వరలహరివలన గిరిగహ్వరములు ప్రతిధ్వనించుచుండ విశ్వామిత్రునిఁజూచి యిట్లనియె. "మహారాజాధిరాజా! అనేకదినములనుండి మీరు భువనవిజయవ్యాపారమందున్నారని వినుచున్నాను. కాని నిరంతరము తపస్స్వాధ్యాయాదియును శ్రావిక క్రియాకలాపములయందుండుటవలన తమవంటి మహావీరుని యత్యద్భుతచరిత్రను దెలిసికొనుట కవకాశము చిక్కినది కాదు. సౌభాగ్యవశమున నేడు నాకు తమదర్శనము లభించినది. కావున నను గ్రహప్రదర్శనపూర్వకముగ తమదిగ్విజయాద్భుతేతిహాసమును వర్ణించి నాకౌతూహలమును చరితార్థమొనర్పఁ బ్రార్థించుచున్నాను."

వసిష్ఠుని మేఘనినాదమును బోలు కంఠధ్వని గిరికహ్వరములయందు విలీనమగుటకుఁ బూర్వమే రాజాధిరాజగువిశ్వామిత్రుఁడు భీషణకోదండ ఝాంకారమునుఁ బోలిన స్పష్టమును-అయినను

దృతమును, గంభీరమును-అయినను నీషత్కర్కశమ
యమును నగు వీరకంఠమున స్వరయోజనం బొనర్చి
యిట్లనియె. బ్రహ్మర్షీ ! నావంటిదీనునిచరిత్రను తమ
వంటిమహానుభావులు వినదలంచుట యత్యంతసౌ
భాగ్యవిషయము. కాని నాకీర్తిని నేనే వర్ణించుకొ
నుటవలన ప్రత్యవాయము గలుగును. అయినను
తమకుతూహలమును నెఱవేర్తును. సామదానభేదదం
డము లనుచతుర్విధోపాయములయందునను దిగ్విజ
యమునకు భేదోపాయమును దండోపాయమును
మిక్కిలి యనుకూలములైనవి. అందువలన నే నాయు
పాయద్వయము నాశ్రయించి దిగ్విజయమునకుం
గడంగితిని. అంగవంగకళింగ త్రిలింగకర్ణాట ద్రావి
డములను, కాశికాంచియవంతికలను, మహారాష్ట్ర
సౌరాష్ట్రగుజరాష్ట్రమత్స్యమగధవిదర్భాదిదేశముల
నొక్కయక్షౌహిణీసైన్యముతోడ హస్తగత మొన
ర్చుకొని నేడు హిమాలయపర్వతద్వారమందు శిబి
రమును స్థాపించియున్నాను. పూర్వాంచలమందలి
చీనా, హూన, సానమాన, శ్యామ, మగ, నాగ

మొదలగురాజ్యములయందలి ప్రజలు తిరుగఁబడి శాసనతిరస్కార మొనర్చుటకుగాను శేవోపాయ మం దతిచతురులును విశ్వాసపాత్రులు నగు మంత్రుల నచ్చటకుఁ బంపితిని. పశ్చిమాంచలమందుండు శక యవన పారద, నరద, అరబు, పారసీ, మ్లేచ్ఛ, కిరాతాదిజాతుల నల్లకల్లోలమొనర్చుటకు తొంబది తొమ్మిదియక్షౌహిణీలసేనతోడ ప్రధానసేనానాయకుని బంపితిని. వారియొద్దనుండి సువార్తలే విన వచ్చుచున్నవి. హిమాలయమును జయించినవి మ్మట నేను సైన్యపరివృతుఁడనై భూప్రదక్షిణం బొనర్చినచో నాదిగ్విజయము సంపూర్ణమగును."

వసిష్ఠుడు: మహారాజా! తమదిగ్విజయవృత్తాంతమును వినుటవలన సంతృప్తి నొందితిని. మీరు సుచతురు లగురాజనీతిజ్ఞులు-యుద్ధనిపుణులు-వీరాగ్రగణ్యులు-మహాయోధులు. కావున మీకు భువన విజయ మసంభవము గాదు. కాని నా కొకవిషయ మునందు సందియముగలుగుచున్నది. దాని నివృత్తి జేసినయెడల కృతార్థుఁడ నగుదును.

విశ్వామిత్రుండు: బ్రహ్మర్షీ ? ఈదీనునియెడ మరి యొక రిట్టియాదేశ మొసంగినచో పరిహాస మని తలంచియుందును. కాని తమవంటిగంభీరస్వభావుల యందు పరిహాసమునకు తావు లేదు. కావున నాకా జ్ఞ యొసంగుడు. తెలిసినంతవరకు విన్నవించి తమ కౌతూహలమును చరితార్థ మొనర్చుటకీదాసుండు సంసిద్ధుండై యున్నాండు.

వసిష్ఠుండు: దిగ్విజయమువలన ఫల మేమి ?

విశ్వామిత్రుండు: మహాశయా? అట్లాజ్ఞాపించ కుండు. దిగ్విజయమువలన సమస్తపృథివికి నొక్కండే రా జగును. ఒక్కరాజు అధీనమందే సమస్తజాతు లయం దైక్యము గలుగును.

వసిష్ఠుండు: దిగ్విజయమందుం జేతలకును విజితు లకును పరస్పరవిద్వేషభావము గలుగును. అందు వలన నైక్యస్థాపనము సంభవముగాదు. మఱియు, జే తలయందు గర్వతారతమ్యమునుబట్టి విజితులయందు బరస్పర ద్వేషభావముత్పన్నమగుచుండును. కావున దిగ్విజయమువలన భ్రాతృభావము గలుగు టెట్లు? సమ

స్తమానవులు సోదర ప్రేమతోఁడ, మెలంగు టెట్లు?

విశ్వామిత్రుఁడు: పృథ్వియందు సోదర భావమును ఐక్యబంధనమును నెలకొల్పుటకు దిగ్విజయము తప్ప మఱి వేఱుసాధనము లేదు. దిగ్విజయి యగు రాజు ప్రజకు పితృతుల్యుఁడు. కావున నాతఁడు ప్రజను సంతానతుల్యముగఁ బాలించుచుండును. అందువలన సమస్తమానవులయందు సోదరత్వ మేర్పడును. ఋభువులసందర్శనమువలన నీయభిప్రాయమే నాకు మఱింతదృఢ మగుచున్నది. దిగ్విజయ మొనర్చి భ్రాతృభావమును ఐక్యమును స్థాపింప నన్ను ప్రోత్సాహపరచుటకే గతించిన రాత్రి ఋభువులు వచ్చియుండిరి.

వసిష్ఠుఁడు: అది మీ భ్రమ. ఋభువు లప్పుడప్పుడు జన్మభూమిని దర్శించుటకు వచ్చుచుందురు. కాని మిమ్ము ప్రోత్సాహపరచుటకు రాలేదు. మఱి యొక మాట. దిగ్విజయమువలన మీరు మానవుల శరీరమునుమాత్రమే జయింపఁగలుగుదురు. కాని వారి మనములమీఁద మీ కేమియధికార మున్నది?

విశ్వామిత్రుఁడు: లే కేమి? వారి మనోగతాభిప్రాయములను వెల్లడింపనీయను.

వసిష్ఠుఁడు: దానిపేరు దమము గాని పాలనము గాదు. అందువలన దానిని భ్రాతృభావ మనుటకు వీలు లేదు. మనస్సునందు ద్వేష ముండిన సోదర భావ మెట్లు గలుగును?

విశ్వామిత్రుఁడు: ఒక్క శాసనాధీను లగు ప్రజల స్థితి యొకేవిధముగ నుండును గదా! అందువలన వారెల్లరు భ్రాతృభావమున నుందురు.

వసిష్ఠుఁడు: అది భ్రాతృభావము గాదు. రుద్ధధూమోద్గారము. ఆయగ్ని ప్రజ్వలించినయెడల దేశ మంతయు దగ్ధ మగును. మఱియు నాయగ్ని శిఖలకు దిగ్విజయు డాహుతి యగును.

విశ్వామిత్రుఁడు: అ ట్లెప్పుడును దలంపకుఁడు. (కుడిచేతినిఁ జూచి) ఈహస్తమందు ధనుర్బాణము లున్నంతవరకును ప్రజలు విద్రోహు లగుదు రనుట కలలోనివార్త.

వసిష్ఠుఁడు: ధనుర్బాణములవలన రక్షింపఁబడున దది భ్రాతృభావ మెట్లగును ?

విశ్వామిత్రుఁడు: అవును ఒప్పుకొన్నాను. భ్రాతృభావమును నెలకొల్పుటకు మఱియొకమార్గమునుఁ జూపగలరా ?

వసిష్ఠుఁడు: జూపలేనియెడల నిన్నిమాట లేల దుకు ?

విశ్వామిత్రుఁడు: మీకమండలమం దేదయిన నుపాయ మున్నదేమో చూచెదను.

వసిష్ఠుఁడు: ఉపాయ మిది. శరీరబలమువలన మానవుల నైక్య మొనర్పజాలము. మానవు లెంత కాలము తమకొఱకు దాము చింతించుచుందురో యంతవరకును నిర్వైరనైనను నేకముగ నొనర్చుటకు సాధ్యము గాదు. కావున మున్ముందు స్వాధీనచింతా ప్రవాహమును బంధించవలయును. నీచజాతుల యందు స్వాధీనచింతనము గలుగకుండునటులఁ బ్రయత్నపడవలయును.

విశ్వామిత్రుడు: నలుగురైదుగురు బ్రాహ్మణులు మానవమండలియొక్క చింతాస్రోతమును బంధించగలరా?

వసిష్ఠుడు: బుద్ధిబలమునకు వశముగాని దెద్ది? బాల్యకాలమునుండియు మానవమనముల నన్యమార్గములకుఁ ద్రిప్పెదను. సుఖభోగరతులుగ నొనర్తును. మనములయం దన్యచింతల నుదయింపనీయను. ఒక్కమాటుగ గ్రంథపాఠమునుండి వంచింతును. అందువలన నొక్కపురుషాంతరమే గాదు. దశపురుషాంతరములవఱకును భ్రాతృభావమును గలిగింతును. ఒక్కమానవులయందే గాదు మానవులకును పశువులకునుగూడ నన్యోన్యము భ్రాతృభావమును గలిగింతును.

విశ్వామిత్రుడు: మానవుని పశుతుల్యునిగ నొనర్చుటయేనా మీ భ్రాతృభావము. ఆశ్చర్యము! ఆ భ్రాతృభావ మెందుకు? బ్రాహ్మణాధిపత్యమును రక్షించుకొనుటకేనా? దిగ్విజయమందు ప్రజలొక్క రాజుయధీనమం దుందురు. కాని యిప్పుడో

లక్షలకొలఁది బ్రాహ్మణులయధికారమం దుండవల యును. అప్పుడైనను మీసంకల్పము నెఱవేఱునా? ఆకాశము మీకు పరమశత్రు వనుమాటను మరచు చున్నారు. ఒక్కమా రాకాశమువంకఁ జూచిన యెడల వానిమనమందలి స్వాధీనచింతాప్రవాహము తనంతట దానుగ పొంగి పొరలకుండునా?

వసిష్ఠుఁడు: నా కావిషయము తెలియును. అందుకు తగినకట్టుదిట్టము లొనర్చితిని. ఆకాశము వంక నెవ్వరిని కన్నెత్తి చూడనీయను. ప్రతినక్షత్ర మును దేవతగ నొనర్తును. నక్షత్రములకును మాన వుని యదృష్టమునకును సంబంధమును గల్పింతును. మఱియు నంతరిక్షమును విభీషికాపూర్ణముగఁ జేయు దును. ఏభావమున నాకసమువంక జూచిన స్వాధీన చింతనము గలుగునో యాభావమున నాకసము కేసి జూడనీయను. సముద్రయానమునవలన స్వాతంత్రేచ్ఛ గలుగును. అందువలన సముద్రయానమును నిషే ధింతును. నిత్యనైమిత్తికకర్మలయందు బ్రాహ్మణుని సహాయము లేక యొక్కయడు గిడుటకైనను నస

మర్థులనుగ నొనర్తును. కాని బ్రాహ్మణుని రాజ్యపద మధిష్ఠింపనీయను సుమా!

విశ్వామిత్రుండు: హా! హా! తెలిసినది. తెలిసినది. మోసబుచ్చి మానవుల వశపరచుకొనుటకు జూచుచున్నారు. అట్లొనర్చుట సాధ్యమగునా? కాదు. కాదు. యుష్మాటికిని కాదు. మానవులు మోసమునం దెంతకాల ముందురు? విశ్వామిత్రుని యనుచరులయం దెవ్వరిని మీరు మోసబుచ్చ జాలరు.

విశ్వామిత్రుని కటూక్తివలన వసిష్ఠుని క్రోధాగ్ని ప్రజ్వలింపం జొచ్చెను. కాన దాని నాతండు మిక్కిలి కష్టముమీఁద నాపుకొనెను. క్రోధోద్రేకమునుండి క్రోధము శాంతించువరకును విశ్వామిత్రుండు మౌనమును ధరించియుండెను. కాని యాతండు కుతర్కమువలనను శ్లేషవాక్యముల తోడను వసిష్ఠుని పరాజితునిగ నొనర్చితి ననుగర్వమున కొంతవడి మాట్లాడకుండెను.

వా రిర్వురు మౌనమును ధరించి కొంతదూరము దిగునప్పటికి విశ్వామిత్రుండు దూరమందున్న స్వశిబి

రమును జూచెను. అప్పుడు విశ్వామిత్రుఁ డాకాశము వంక దృష్టి నిగిడించి తిరిగి వసిష్ఠునిఁ గాంచి యిట్లనియె. "మహాత్మా! నేడు చాల ప్రొద్దెక్కినది. విశేషమగు ప్రతిబంధకము లెవ్వియు లేనియెడల నా శిబిరమునం దాతిథ్యమును గైకొని నన్ను గృతార్థునిఁగఁ జేయఁ బ్రార్థన" అన వసిష్ఠుఁ డంగీకరించెను. విశ్వామిత్రుఁడు వసిష్ఠుని సమాదరమున స్వశిబిరమునకుఁ దోడ్కొని యేగి మహాసమారోహమున నతిథిసత్కారము లొనర్చెను. మఱియు దిగ్విజయమందు సంపాదించిన పలువిధరత్నరాసులనుఁ జూపించి యందు కొన్ని యమూల్యరత్నములను వసిష్ఠున కుపాయనం బొసంగెను. అందువలన వసిష్ఠుడు సంతుష్టచిత్తుఁడై విశ్వామిత్రుని తనయాశ్రమమునకు నిమంత్రణం బొనర్చి స్వస్థానమునకు నిర్గమించెను.

## ఆశ్రమము

విశ్వామిత్రుఁడు నిర్ణీతసమయమున వసిష్ఠాశ్రమమునకు వచ్చెను. వసిష్ఠుఁడు చాలదూర మెదురేగి మిక్కిలి యాదరసన్మానములతోఁడ విశ్వామిత్రునఁ

దొడ్డాకాని వచ్చెను. విశ్వామిత్రుఁడా శ్రమశోభనుఁ గాంచి యాశ్చర్యాన్వితచిత్తుఁ డగుచుండెను. ఆ శ్రమ మందంతటను తాల, తమాల, హింతాల, శాల,వక, వకుళ- మొదలగు ప్రకాండకాయము గలవృక్షరాజ ములు విరాజిల్లుచుండెను. కాని వానియడుగున లతాగుల్మములు లేకుండుట చేత క్రింద నల్లపూసబడి నను గనుపడుచుండెను. ఆమహాదాశ్రమమందు భల్లూకములు వ్యాఘ్రములు సింహములు వృక ములు మొదలగు క్రూరవన్యమృగములును వివి ధము లగువిషసర్పములును నిర్భయముగ దిరుగు చుండెను. కాని యవి యావులు మేకలు మొదలగు ఖాద్యజంతువులకేసి కన్నెత్తియైనఁ జూచుట లేదు. ఆవులు మేకలు మొదలగునవి పులులు సింహములు మొదలగువానినిఁ జూచి యణుమాత్రమైనను భయ మొందకుండెను. వసిష్ఠవిశ్వామిత్రులు తపోవనమునుఁ బ్రవేశించినంతనే యవియన్నియు వారి కిరుపార్శ్వ ముల బారులుదీరి నిలచి నమస్కరింపసాగెను. ఆ దృశ్యమునుఁ జూచి విశ్వామిత్రుఁ డిట్లనియె.

"మహాత్మా! తాము బుద్ధిబలమువలన నడవిమృగ ములనుఁగూడ వశపరచుకొనఁ గలిగితిరి. కాని మానవుల వశపరచుకొనజాలరు.

వశిష్ఠుడు: మహారాజా! ఇవి స్థానమాహాత్మ్యము వలన నిట్లు ప్రవర్తించుచున్నవి. కాని నాబుద్ధిబలము వలన గాదు.

ఇట్లనుకొనుచు వారిర్వురు కొంతదూర మేగునప్పటికి అదృశ్యమంతయు మారి యది యుద్యానవనముగఁ బరిణమించెను. వృక్షములన్నియు నగత్కాలమందు పుష్పములతోడ నిండి నిబిడీకృతమై యలరారఁజొచ్చెను. అందువలన నాశ్రమమందంతటను నత్యంతసుందర మగు తివాసీని పరచినాయను నట్లు గన్పట్టుచుండెను. ఒకచోట తెల్లనిపుష్పములు, వాని నంటుకొని వరుసగా క్రిందికి తెల్లనిపుష్పములు విరాజిల్లుచుండెను. ఒకచోట నీలపుష్పములు- వాని నంటుకొని వరుసగా నీలపుష్పములు విలసిల్లుచుండెను. ఒకచోట ఎరుపు, మరియొకచోట పసుపు, వేరొకచోట పీతవర్ణమున నలరారుపుష్పములు వరు

సగ నుండి యొక్కొక్కచోట నొక్కొక్కవర్ణము మి క్కిలిగ రాణించుచుండెను. వర్ణవైచిత్ర్యము లేని చోట వాని క్రింద నుండువివిధ పుష్పము లాలోప మును దీర్చుచుండెను. ఈయుద్యానవనమునకు నలు దిక్కుల నుండు నానా విధసుగంధపుష్పములు వాయు భరమున గదలుచు సుగంధమును వెదజల్లుచుండె ను. ఆయుద్యానవనమధ్యమున నొకగొప్పసరోవర ముండెను. ఆసరోవరముచుట్టును చంద్రకాంతశిల లతో గట్టిన సోపానములు నీటియట్టడుగును దాకు చుండెను. అందలి నీ రతిస్వచ్ఛముగ నుండుటవలన నామెట్లు అట్టడుగునుండియు, సుస్పష్టముగ గన్పట్టు చుండెను. ఆసరోవరమున కీవలనుండి యావల కొక సేతువు గలదు. ఆసేతువున కిరుపక్కల మరకత ములతోడ గట్టబడిన నొకచిన్నిగోడ గలదు. ఆగో డమీద నచ్చటచ్చట నవరత్నములతోడ నిర్మిం చిన విచిత్రస్తంభము లుండెను. వానిపైన సుస్వర మున బాడుకోవెలలు మొదలగుపక్షులును పలు వన్నియలచే చిత్రితములైయున్న పక్షములు-పుచ్ఛ

ములతోడ నలరారుమయూరములును గానము జేయుచు నృత్యము సల్పుచు నతిథియగు విశ్వామిత్ర మహారాజున కభ్యర్థన మొనఁగుచుండెను. ఆసరో వరమందు నలుపు తెలుపు పసుపు ఎఱుపు గులాబి నీలము-మొదలగు వివిధవర్ణవిరాజితము లగుమత్స్య ములు కేళి సల్పుచుండెను. దాని కనతిదూరమం దొకసౌధరాజ మాకాశమును చుంబించుచు జూప రులకు నేత్రపర్వ మొనర్చుచుండెను. దాని ద్వారము తెల్లనిపాలరాళ్లతోడ నిర్మింపఁబడినది. ఆ ద్వారము పైన సువర్ణాక్షరములతోడ "స్వాగతం గాధికులతి లకస్య విశ్వామిత్రస్య" అని వ్రాయఁబడియుండెను. విశ్వామిత్రుఁడు నివ్వెరపడి చూచుచు నాసౌధరాజ మును బ్రవేశించెను. ఆతఁడు సమస్తపృథ్విని జయిం చెను గాని యట్టిసౌధరాజమును నెచ్చటను గాంచి యెఱుఁగడు. అందువలన నాతఁ డాశ్చర్యాన్విత చిత్తుఁ డాయెను. ఆసౌధమందు వస్తువులన్నియు మంచిగంధపుచెక్కలతోడను ఏనుగదంతములతో డను జేయఁబడి వానియందు ముత్యములు నవరత్న

ములు చెక్కఁబడి యుండెను. ఆమందిర ముత్కృ ష్టమగు చంద్రకాంతశిలలతోడ నిర్మింపబడి కన్నులు మిఱుమిట్లు గొల్పుచుండెను. దానిగోడలమీద పరశురాముని యుద్ధచరిత్రము చిత్రితమాయెను. ఒక గోడయందు పరశురాముఁడు క్షత్రియశోణితముతోడ బితృతర్పణం బర్పించుచుండుటను, మఱియొక కుడ్యముమీద క్షత్రియులతో యుద్ధముసల్పుచుండుటను-మొదలగు పరశురాముని యిరువదియొక్క యుద్ధములను ఇరువదియొక్క గోడలమీద వ్రాయఁబడియుండెను.

విశ్వామిత్రుఁ డాశ్చర్యచకితుఁడై మందిరములు అందలి సమస్తవస్తువులను చిత్రరుపులను దిలకించి మనమునం దిట్లనుకొనెను. "వసిష్ఠుఁడు నన్నువమానించుట కాహ్వానించియున్నాఁడు. నేనొసంగిన యాతిథ్యమునకంటె సీతఁడొసంగిన యాతిథ్యము వేయిమడుంగు లెక్కుడుగ నున్నది. మఱియు నిదివఱకు జరిగిన ప్రసంగమునకుఁ గూడ బ్రత్యుత్తర మిచ్చియున్నాఁడు." అని దలంచినకొలందిని వసి

ష్టునియం దాతనికి ద్వేషభావము వృద్ధికాఁజొచ్చెను. దానితోడ హింస ప్రజ్వలింపసాగెను. కాని మనో భావ మణుమాత్రమైనను వెలిబుచ్చక నాతిథ్యమును స్వీకరించెను. భోజనముచేసి తాంబూలమును వేసి కొనుచు నృత్యగీత శ్రవణం బొనర్చెను. విశ్వామిత్రుఁ డటనుండి బయలుదేరునప్పుడు వశిష్టుఁ డమూల్య పదార్థములను దీసికొని వచ్చి గ్రహింపుఁడని గోర నాతఁ డిట్లనియె. "మహాత్మా! తాము ఋషులు–వన వాసులు–అట్టి మీ కీదృశైశ్వర్య మెట్లు గలిగినది?

వసిష్ఠుఁడు: మహారాజా! నాయొద్ద "నందిని" యనుధేనువు గలదు. దానితల్లి కామధేనువు. అది నా కేమి కావలయు ననిన దాని నొసంగుచుండును.

విశ్వామిత్రుఁడు: అట్లయిన నా కానందిని నొసంగుఁడు. కాని యిట్టిసామాన్య బహుమతులవలన నేను సంతృప్తుఁడను గాను.

వసిష్ఠుఁడు: నే నానందినిని దెచ్చునప్పుడు దాని నెవ్వరి కొసంగ నని కామధేనువుకడఁ బ్రతిజ్ఞ జేసి తిని. కావున నిచ్చుటకు వీలులేదు.

విశ్వామిత్రుఁడు: దాని నొసంగనియెడల నతిథిని నవమానించుటయే సుమా! మఱియు మీరు సంఘవ్యవస్థాపకు లనువిషయమును గూడ జ్ఞప్తికి దెచ్చుకొనుఁడు.

వసిష్ఠుఁడు. బలమువలనఁగాని కౌశలమువలన గాని ప్రతిజ్ఞాభంగ మొనర్చుట గురుతరాపరాధము కావున మీ రాయన్యాయోద్దేశమును వీడుఁడు.

అప్పుడు విశ్వామిత్రుఁడు తనమనోభావమును దాఁచుకొనఁజాలక నుండిపడుచు తీవ్రముగ నిట్లు నెను. "మీ రొసంగరా? అట్లయిన నేనే గైకొందును. దొంగిలించుటవలన కలుగు అపరాధము ప్రతిజ్ఞాభంగ మొనర్చు నపరాధమునకంటె గురుతరము గాదు."

అని తనయనుచరులను గాంచి 'నందినిని' బట్టుకొని రం డని యాజ్ఞాపించెను. వసిష్ఠుఁడు "అతిథి సర్వదేవమయుఁడు కాని యాతఁడు బలవంతముగ నందినిని నపహరింపఁదలఁచినాడు ఏమిచేయుదును?"

అని తీవ్రమైనందోళనము నొందుచు నిరుత్తరుండై యుండెను.

విశ్వామిత్రునియనుచరులు నందినిని బట్టుకొనుటకు బ్రయత్నించిరి. అప్పు డాధేనువు కన్నీరు కార్చుచు వసిష్ఠుని కేసి చూడ నాయన యేడ్చుచు నిట్లనియె. "వత్సా! నే నేమి చేయుదును? విశ్వామిత్రుండు మహారాజు. ప్రబల ప్రతాపాన్వితుండు. దిగ్విజయుండు. ఇచ్చటి కతిథిగ వచ్చి నిన్నెత్తుకొని బోజూచుచున్నాడు. కావున నిన్ను నీవే రక్షించుకొనుము."

అనినంతనే నందిని హుంకరించెను. ఆశబ్దము వలన భూమ్యాకాశములు బ్రద్దలాయెను. అందుండి గణనాతీతమగు పారద పారస చీన సౌన మూన— మొదలగు నానాజాతులసేనలు యుద్ధసన్నద్ధులై వచ్చి ధేనువును రక్షించుటకుఁ బూనుకొనిరి. వారినిఁ గాంచి విశ్వామిత్రుఁ డిట్లు దలంచెను. "పారదాది జాతులను నాసేనాను లింతవరకును బాహుబలము వలన వశపరచుకొనలేదు. కాని వసిష్ఠుండు బుద్ధి

బలమువలన వారినందఱను వశపఱచుకొనియు న్నాఁడు. కావున బుద్ధిబలమువలన మానవులను వశ పఱచుకొనవచ్చును."

## యుద్ధము

యుద్ధము ప్రారంభమాయెను. ధేనువున కొక వైపున క్షత్రియసేనలును రెండవదిక్కున యవన సేన లుండెను. నందినిని క్షత్రియులచే జిక్కకుండ దప్పించుటకు యవనులు ప్రయత్నించుచుండిరి. కాని క్షత్రియులు తమ ప్రయత్నమును వీడకుండిరి. బ్రాహ్మ ణునికొఱకు యుద్ధము జరుగుచుండెను. కాని బ్రాహ్మ ణుఁడుమాత్రము దర్శకుఁడై యుండెను. ఇరుపక్ష ములవారును దీర్ఘకరవాలములను బల్లెలను ద్రిప్పు చుండిరి. ధనుస్సులయందు బాణముల సంధించు చుండ నాశబ్దము మేఘునినాదమును ధిక్కరింప సాగెను. విశ్వామిత్రుఁడు స్వయముగ క్షత్రియ సైన్యముల నడిపింపఁజొచ్చెను. కాని బ్రాహ్మణపక్ష మున నాయకుఁ డెవ్వఁడును లేఁడు. అతిథితోడ

యుద్ధ మొనర్చుటకు వసిష్ఠుఁ డయిష్టుఁడై యుండెను. అందువలన పుత్రులనుగాని శిష్యులనుగాని యుద్ధమునకు బంపకుండుటయేగాక వారి కిట్లు చెప్పెను. "పుత్రులారా! శిష్యులారా! క్షత్రియులవిషయ మెట్లున్నను 'బ్రాహ్మణస్య బలం క్షమా.'' అని శాస్త్రములయందు జెప్పఁబడియున్నది. కావున బ్రాహ్మణుఁడు యుద్ధము జేయఁగూడదు''

యుద్ధము జరుగుచుండెను. రక్తపాత మారంభమాయెను. క్రమముగ రక్తము బ్రవహింపఁజొచ్చెను. యుద్ధక్షేత్రమందలి ధూళి నెత్తురునందు గలసి బురదయయ్యెను. వేలకొలఁది పదాతులు ఏనుగులు అశ్వములు రథములు నాశనమగుటను గాంచి విశ్వామిత్రుఁడు భయంకరమగు శరజాలమును ద్రిప్పుచు రణరంగమునందు దుమికెను. ఒకొక్క దెబ్బకు నందలకొలఁది యవనులమస్తకములు క్రింద పడి దొర్లసాగెను. కాని ప్రయోజనం బేమి ? వృథా ప్రయాసయయ్యెను. ధేనువుయొక్క ప్రతిహుంకారము నుండియు నొక్కొక యక్షౌహిణీసేన పుట్టుచుండెను.

ఆసైన్యము సముద్రతరంగమువలె నెదుర్కొనుచుం డెను. వానిని హతమొనర్చు టెట్లు? విశ్వామిత్రుని ప్రయత్నమంతయు వ్యర్థమాయెను. అందువలన నాతఁడు ధేనువును చంపుఁడని యాజ్ఞాపించెను. కాని యంతవరకును ధేనువు క్షత్రియులచేఁ జిక్క లేదు. వెంటనే క్షత్రియులు తీవ్రనారాచములఁ బరపి ధేనువును చంపఁ జూచిరి.

అప్పు డాధేనువు దివ్యసుందర స్త్రీరూపమును ధరించి యాకాశమందు గాన్పించెను. శ్వేతపద్మాసనయు, శ్వేతాంబరధారిణియు నగునాదివ్యసుందర మూర్తితోడ పూర్ణిమనాటి పండువెన్నెలలు పరిభవింపఁబడుచుండెను. ఆమె హస్తములయందు తెల్లని వీణె యలరారఁజొచ్చెను. ఆమె లావణ్యమువలన జగత్తంతయు దేదీప్యమానమగుచుండెను. ఆమె భూషణములన్నియు శ్వేతపద్మములై యుండెను. ఆదివ్యసుందరమూర్తి విశ్వామిత్రునిఁ జూచి యిట్లనియె. "ఓరీ మూర్ఖా! నేను బ్రాహ్మణవిద్యను. నన్ను నీ వపహరింపఁగలవా? నేను కులక్రమాగతముగ బ్రాహ్మణగృహమందు నివసించుచుందును. ఇప్పుడు నివసించుచున్నాను. ఇఁకముందుగూడ నివసింతును."

ఆవాణిని విని విశ్వామిత్రుఁడు విస్మయాపన్న చిత్తుఁడాయెను. సరస్వతీదేవి తిరిగి ధేనురూపమును దాల్చి వసిష్ఠునిసన్నిధియం దుండెను. సమస్తయవన సైన్యములు గాలియందు విలీన మయ్యెను. వసిష్ఠుఁడు నేత్రాంచలమునుండి యశ్రుబిందువులు రాలుచుండ ధేనువుమీఁద చేయినైచి గోకసాగెను.

విశ్వామిత్రున కిదియే ప్రథమపరాజయము. చిత్తక్షోభము-దుఃఖము-క్రోధము-హింసవలన విశ్వామిత్రుఁడు ధేనువునకేసిగాని వసిష్ఠునివంకఁగాని జూడక క్రోధమువలన ధనుర్బాణముల విసర్జించెను. స్వదేశమున కేగుటకు సైన్యమున కాజ్ఞయొసంగి రాజ్యభారమును మంత్రులపై నిడి యిట్లనియె. "ధిక్ క్షత్రియబలం బ్రహ్మతేజో బలం బలం." అని తపస్సు చేసి బ్రాహ్మణత్వము నార్జించుటకు హిమాలయగిరి కందరములకు నిర్గమించెను.

కేవలము బాహుబలమువలన జగత్తునంతయు నేకముగఁజేసి నడిపింపవచ్చు ననుతలంపు వ్యర్థ మని విశ్వామిత్రుఁడు గ్రహించెను.



శ్రీ

# వాల్మీకి విజయము

## మూడవ ప్రకరణము



### తపస్సు

విశ్వామిత్రుఁ డెచ్చట కేఁగినదియు నెవ్వరికిని తెలియదు. ఆతని సైన్యములు మాత్రమే రాజధానికి వచ్చెను. మంత్రి రాజ్యము జేయుచుండెను. ఆతని భార్యా పుత్రాదులు విశ్వామిత్రుఁడు రేపు వచ్చును-ఎల్లుండి వచ్చు నని తలంచుచుండ, దినములు-వారములు-వత్సరములు - గడచుచుండెను. వశిష్ఠుఁ డెప్పటివలెనే బ్రాహ్మణక్షత్రియుల సమ్మేళనమునకుఁ బ్రయత్నించుచుండెను. కాని విశ్వామిత్రునిపక్షావలంబు లాయనకు ప్రబలవిరోధులై యుండిరి. అందువలన నాతని ప్రయత్నములువిఫలములుగాఁజొచ్చెను.

విశ్వామిత్రుఁడు బయలుదేరి "బ్రాహ్మణుఁడ నగుదును. బ్రాహ్మణక్షత్రియబలముల నేకముగ నొన ర్చి ససాగరధరాతలమునకు చక్రవర్తి నగుదును. మానవుల నొక్కశాసనాధీనులుగ నొనర్చి యెల్లరి యం దైక్యమును స్థాపించెదను." అని తలంచుచు హిమాలయపర్వతమందలి యొకదుర్గమస్థానమున కేగి ఘోరతరతపస్సున కుపక్రమించెను. ప్రథమదివ సమున నొక గ్రాసమును, ద్వితీయదివసమున నర్ధగ్రాస మును తృతీయదిన మొకబియ్యపుగింజను చతుర్థ దివసమందు బియ్యపుగింజలోసగమును మాత్ర మాహారము దినెను. పిమ్మట నొకజలబిందువును మాత్రము ద్రావి యంతటితోడ నాహారమును మాని తపమునకుఁ బ్రారంభించెను. ఆతనిశరీరము క్రమక్రమముగ కృశింపఁజొచ్చెను. వసంతము గ్రీష్మ ము మొదలగుఋతువు లొకదానితర్వాత నొకటి గడచుచుండెను. కాని విశ్వామిత్రుఁడు కన్నులు దెరువక కేవలము ధ్యానమందుండెను. ఆయననేత్ర ములు కోరరగతము లాయెను. నాసికమధ్యమం

దలి యెముక స్పష్టముగ గన్పడుచుండెను. ఆయన శరీరపంజరముపైన చర్మము మాత్ర మాచ్ఛాదితమై యుండెను. కేశరాజిజడలుకట్టి భూమియందు పాదుకొనెను. పదనఖములు పెరిగి భూమిలోనికి గ్రుచ్చుకొని పోవుచుండెను. పక్షు లాయనశరీరముమీఁద నివసింపఁజొచ్చెను. కాని విశ్వామిత్రునితపము పూర్తికాలేదు. వ్యాఘ్రములు భల్లూకములు మొదలగు క్రూరజంతువు లాతనిఁ గాంచి దూరమునుండియే తొలఁగుచుండెను.

ఆ భయానకావస్థయందు విశ్వామిత్రుఁడు పలువిధస్వప్నములను గాంచసాగెను. అందొకస్వప్నమం దీజగత్తంతయు నాతనికి పరమాణువులుగఁ గన్పడెను. వానిమధ్యభాగమందు దానొకఁడుమాత్ర ముండెను. కాని నిమేషకాలములో నాయనశరీరము బ్రహ్మాండములన్నిఁటి నావరించెను. ఆయన తేజమువలన పరమాణువులు దగ్ధము గాఁజొచ్చెను. చివరకు స్వశరీరముగూడ దగ్ధమగుచుండెను. ఆదారుణమగు నంతర్జ్వాలలవలన నాయనకు ధ్యానభంగమాయెను.

కనులు విప్పి చూడ సమ్ముఖమందు యువతీమణులగు నప్సరస్త్రీలు నృత్యము సల్పుచుండిరి. అందు గొంద ఱాయనను జుట్టుకొని తిరుగుచు నృత్యముఁ జేయ జొచ్చిరి. మఱికొందఱు నడుముపైభాగమందుండు వస్త్రమును దొలఁగించి రొండినిఁ జేతులు పెట్టుకొని నిలుచుండిరి. కొంద ఱాయనమీఁద కటాక్షవీక్షణ ములఁ బరపుచుండిరి. ఆచూపులు కోమలమును చంచలమును హృదయాభిలాష నుద్బోధింపఁ జేయు నవిగ నుండెను. మఱియు నొకప్పు డతి యాలస గను, వేఱొకప్పుడు విద్యుద్దీపమునుఁ బోలియుం డెను. ఇంకొకప్పుడు కనుఱెప్పలు కంపించుచుం డెను. అందువలన వారిచూపులు తీవ్రనారాచములఁ బోలి విద్ధమగుచుండెను. వారిలో గొందఱు తలల ముడుచుకొనిరి. మఱికొందఱు తలల విఱియఁబోసి కొనియుండిరి. కొందఱు కేశముల జారవిడచుకొ నిరి. మఱికొందఱు కేశములచివర వేసికొనిన జారు ముడి వాయుతాడనమువలన నటునిటు గదలు చుండెను. ఆయప్సరస్త్రీలు నానాహావభావముల

వికాస మొనర్చి కామోద్రేకమును వెల్లడించుచుండిరి. అప్పుడు విశ్వామిత్రుని యంతర్దాహ మొకింత యుపశమిల్లెను. వెంటనే యాతఁడు ధ్యాననిమగ్నుఁ డాయెను.

విశ్వామిత్రుఁడు మఱియొకస్వప్నమునుఁ గాంచెను. అందు కోటిసూర్యులు వెలుంగఁజొచ్చిరి. ఆ తేజమునకు నేత్రములు మూతపడుచుండెను. శరీరము మండఁజొచ్చెను. ఆమంటలకు తాళఁజాలక విశ్వామిత్రుఁడు పలాయనుఁడు కాసాగెను. కొంతదూర మేగునప్పటికి సూర్యతేజము మందగించెను. అతఁడెచ్చట యడుగిడిన నచ్చట వేలకొలఁది భయంకర సర్పములు గఱచుచుండెను. ఆవిషజ్వాలలవలన నాతనికి ధ్యానభంగమయ్యెను. కనులు దెరచి చూచునప్పటికి సమ్ముఖమందు భయంకరాకారములతోడ పలువిధజంతువు లాతనిని భయపెట్టసాగెను. అందు గొన్నిటి మోములు సూకరముల మోమును బోలి యుండెను. కాని మెడయందు సింహములఁబోలి కేసరములు వ్రేలాడఁజొచ్చెను.

వానితోక లొక యోజనదూరమువఱకు వ్యాపించి యుండెను. వానియందు గొన్ని భయంకరపిశాచములు. వాని నెత్తిమీఁద కన్నులుండెను. శరీరమందు సగముభాగము కాళ్లుచేతులతోడ నిండియుండెను. ఆపిశాచములు కాళ్లుచేతులు నలుదిక్కులజాచి వాని కఖదినయాహారమును నోటియందు వైచికొని గుటుక్కున మ్రింగసాగెను. అందు కొన్నిటిదంతములు సూకరదంతములఁ బోలియుండెను. మఱికొన్నిఁటి దంతములు ఏనుగుదంతములఁ బోలియుండెను. కొన్ని పిశాచములతలలు పర్వతశిఖరముల ధిక్కరించుచుండెను. మఱికొన్నిఁటికి తలలుమాత్రమే కనుపడుచుండెను. కాని వానికి పాదములు గలవో లేవో యనుసంశయము కలుగసాగెను. కొన్ని పిశాచస్త్రీల స్తనములు పర్వతశిఖరతుల్యములై యుండెను. ఆపిశాచములశరీరములు ఎరుపు-నలుపు-నీలము మొదలగు పలువర్ణములతోడ భయంకరముగ నుండెను. సేనానియాజ్ఞానుసార మాభయంకరసైన్యము విశ్వామిత్రుని నాక్రమించెను. అప్పుడు విశ్వామిత్రుని

యాత్మపురుషుఁడు శుష్కించెను. కాని యాయన వీక్షణములవలన పిశాచసేన విధ్వంసము కాఁజొచ్చెను. కొన్ని పిశాచములచేతులు కాళ్లు దగ్ధమాయెను. మఱికొన్ని మరణించెను. కొన్నింటి తలలు పగిలెను. పిశాచస్త్రీలపర్వతశృంగముల వంటి స్తనములు తెగి క్రిందపడుటవలన వాని దేహములు చులకనాయెను. ఒకనితల మఱియొకని మెడమీఁద నుండెను. ఒకని కాళ్లు మఱియొకనితలమీఁద నిలుచుండెను.

ఈవిధముగ సైన్యమంతయు ధ్వంసమగుటవలన పిశాచసేనాని విశ్వామిత్రునితోడ స్నేహమొనర్చుటకు నవ్వుచు నాతనిని సమీపించి యిట్లనియె. "విశ్వామిత్రా. నీవు మహాపరాక్రమశాలివి. భుజబలమువలన సమస్తభూమండలమును జయించియున్నావు. తపశ్శక్తితోఁగూడిన నీకటాక్షవీక్షణముల చేత నాసైన్యమంతయు నాశనమైనది. కావున నీవు నాకు పుత్రుఁడవు గమ్ము. ఈ బ్రహ్మాండమం దుండు అసుర-పిశాచ-దైత్య-దానవులందరు నాయధీనమం

దున్నారు. కాబట్టి నీవు నా కుత్తరాధికారివి గమ్ము. కొలఁదిదినములలో నిన్ను రాజుగ నొనర్చి నేను సుఖభోగముల ననుభవించుచుందును. నీవు నాకు పుత్రుఁడవు గమ్ము. ఈ హిమాలయపర్వతశిఖరాగ్రముమీఁది కెక్కి చూచిన యెడల నలుదిక్కుల గనుపడు రాజ్యములన్నియు నీయధీనమం దుండును. చీనా-జపాను-మిసరము-పారస్యము మొదలగు దేశములుగూడ నీహస్తగతమగును. నిన్నాకర్షించుటకుఁ బ్రయత్నించిన సుందరీమణులు నాకు భోగవిలాసినులు, జగత్తునందలి సమస్తమణులు-ముత్యములు-బంగారు, మొదలగునవన్నియు నాస్వాధీనమం దున్నవి. మఱియు నా ప్రజ యగణితము-కావున నీవు నాకు పుత్రుఁడవు గమ్ము. నామహైశ్వర్యముతోఁ గూడిన రాజ్యమున కధీశ్వరుఁడవు గమ్ము. ఈవిషయమున నీకెట్టియోచనయు నుండఁజనదు. రాజ్యమంతయు నీకు వశమగువరకు నేను నీకడ నుండి రాజ్యరక్షణ కవసరమగు సమస్తవ్యవస్థల నేర్పరతును. అన విశ్వామిత్రుఁ డిట్లనియె. "నీవు బ్రాహ్మణత్వ

మొసంగగలవా? 'నందిని' యనుధేనువు నిచ్చెద వా? విద్య నొసంగఁజాలుదువా? సరస్వతీదేవి నియ్యగలవా?"

అన పిశాచనాయకుం డిట్లనియె. "ఇవ్వఁజాలను. కాని బ్రాహ్మణులతోడ వివాద మొనర్చగలశక్తిని మాత్ర మీయఁగలను. నందినిని చంపి దానిని నీ కొసంగఁగలను. విద్యను మూలచ్ఛేద మొనర్పఁగలను. సరస్వతీదేవినిమాత్ర మేమియుఁ జేయఁజాలను."

అట్లయిన నీతోడ నాకు బని లేదని నుడివి విశ్వామిత్రుఁడు తిరిగి తపోనిమగ్నుఁడాయెను.

## విశ్వామిత్రుని దర్శనము

అప్పుడు విశ్వామిత్రునినేత్రములు మూతబడకుండెను. ఏలయన క్రమానుగతముగ నిశ్వాసమును బంధించుటవలనను అనాహారమువలనను ఒక్కవిషయమునే తదేకనిష్ఠతోడ జింతించుచుండుటవలనను నాతనికన్నులు మూతపడకుండెను. ఘోరతరతపము వలన నాతఁడు బాహ్యజ్ఞానశూన్యుఁ డాయెను. ఆతని కర్ణకుహరములనుండి యొకమహానాదము

వెలువడఁజొచ్చెను. నాసికనుండి యగ్నిస్ఫులింగములు నిర్గతమగుచుండెను. ఆశబ్దానంతరము రాశిచక్ర మాయనమస్తకమును జుట్టి దక్షిణమునుండి వామపార్శ్వమునకు దిరుగసాగెను. ఛాయాపథము గిఱ్ఱున తిరిగి నిలుచుండెను. అభ్యంతరస్థితమగు అగ్నియుత్తాపమువలన నాకస్మికముగ బ్రహ్మారంధ్రము విడివడెను. జగత్తంతటను 'ఓం' అనుశబ్దము బుట్టెను. ఆశబ్ద మాకాశమందు గిరగిరదిరుగుచు చివరకు బ్రహ్మాండముయొక్క కపాలపాలికను విదీర్ణ మొనర్చుకొని బహిర్గతమాయెను. అది దూరస్థితమగుశతసహస్రమేఘగర్జనముల మించి యిట్లు వినఁబడెను.

ఓం భూర్భువస్స్వః తత్సవితుర్వరేణ్యం
భర్గోదేవస్యధీమహి ధియోయోనః ప్రచోద
యాత్ ఓం.

ఆమంత్రమును వినినంతనే నాతని తలయందలి బ్రహ్మారంధ్రము ముకుళించుకొనెను. ఒక్కనిమేష కాలములో నాతని శరీరము సబలమును-సతేజము

ను-కాంతియుతముసయ్యెను. అప్పుడు విశ్వామిత్రుం డిట్లు దలంచెను."నా కింకను బ్రాహ్మణత్వము లభించ లేదు. కాని బ్రాహ్మణుల సత్వమగు వేదమంత్ర మును దర్శించితిని. ఇంతవరకిది చాలును." అని తలం చుచు తిరిగి ధ్యాననిమగ్నుఁడాయెను.

ఋషులసమావేశము

విశ్వామిత్రుని తపస్సువలన బ్రహ్మాండమంతయు నల్లకల్లోలము కాఁజొచ్చెను.అందువలన బ్రహ్మవిశ్వా మిత్రుని బ్రాహ్మణునిగ నొనర్చుటకు బ్రహ్మర్షుల నాహ్వానించెను. కణ్వుఁడు మొదలగు బ్రహ్మర్షులును నారదాదిదేవర్షులును బ్రహ్మసన్నిధికి వచ్చిరి.వారంద రాకాశపథమందు సభచేసిరి. అప్పు డాకాశమందు వందలకొలఁది సూర్యు లుదయించినటు లుండెను. ఆసభయం దొక శూద్రరాజును బ్రాహ్మణునిగ నొనర్చిరి. విశ్వామిత్రునకు దృష్టమైన మంత్రము గాయత్రీనామమున బ్రాహ్మణులకు మాత్రమే యారాధ్యమును జపనీయమంత్రముగ నంగీకరించిరి. బ్రహ్మవిశ్వామిత్రుని బ్రాహ్మణునిఁగ నొనర్చుటకు

ఋషులసమ్మతిని గోరెను. కాని బ్రహ్మర్షులు-దేవర్షులయుం దెవ్వ రావిషయమున కామోదింపకైరి. మఱియు వారిలో గొందఱిట్లనిరి. "విశ్వామిత్రుం డిప్పుడే దాదాపుగ విశ్వమునకు గర్త్రయై యున్నాఁడు. ఆతనికి బ్రాహ్మణత్వమును విద్యయు లభించినయెడల నొక్కనిముసమున సృష్టిని నిర్మూలనము చేయును."

మరికొందఱిట్లనిరి. ఆతనిదురాకాంక్షకు మేర లేదు. అందువలన నేఁ డతనికి బ్రాహ్మణత్వము లభించినయెడల రేపు బ్రహ్మత్వమును గూడ వాంఛించును. కావున నాతనికి బ్రాహ్మణత్వ మొసంగఁగూడదు.

పిమ్మట బ్రహ్మర్షులందరును తమకు బ్రతినిధిగ బ్రహ్మను విశ్వామిత్రునికడకుఁ బంప నిశ్చయించి యాయనతోడ నిట్లనిరి. "విశ్వామిత్రుం డేదికోరినను వాని కొసంగుఁడు. కాని బ్రాహ్మణత్వమునుమాత్ర మీయవలదు" అన భగవానుం డగు బ్రహ్మ రవివినిందితప్రభారాశిని వ్యాపింపఁ జేసి సూర్యరశ్మియను రథము నధిరోహించి హిమాలయపర్వతమందు

తపోనిమగ్నుఁడై యున్న విశ్వామిత్రునికడకు వచ్చి యాతనికి ధ్యానభంగ మొనర్చి యిట్లనియె. "విశ్వామిత్రా! నేను బ్రహ్మను. నీతపమునకు మెచ్చితిని. పరమానందభరితుఁడ నైతిని. నీకు వర మొసంగ దలఁచి యిట వచ్చితిని. కావున గావలసినవరమును గోరుము. ఉచిత మని దోఁచినయెడల దానిని నీ కొసంగుదును."

అన విశ్వామిత్రుఁ డిట్లనియె "నాకు బ్రాహ్మణత్వ మొసంగగలవా?

బ్రహ్మ: ఇవ్వను.

విశ్వామిత్రుఁడు: అట్లయిన నీవంటి బ్రహ్మ వరముతోడ నాకుఁ బనిలేదు.

అన బ్రహ్మయొకింతవిచారముతోడ తిరిగి సూర్యరశ్మి రథము నధిరోహించి బ్రహ్మర్షులసభకు వచ్చి జరిగినవిషయమును జెప్పి తిరిగి విశ్వామిత్రుని బ్రాహ్మణునిఁగ జేయుఁ డని కోరెను. కానియం దెవ్వఁడును సమ్మతింపకుండెను. వారందరు విశ్వామిత్రుని కడ కేఁగి బ్రాహ్మణత్వమువలన గలుగుకష్టముల

నాయనకుఁ దెలియఁజెప్పి మఱియొక వరదానము వలన నాతని సంతృప్తునిఁగఁజేయ నిశ్చయించుకొనిరి.

ప్రథమమున విశ్వామిత్రునికడ కేగుటకు వసిష్ఠుఁ డంగీకరించకుండెను. కాని దేవర్షుల యనురోధము వలన వసిష్ఠుఁడుగూడ వచ్చుట కంగీకరించెను.

అప్పుడు తేజఃపుంజమున బ్రకాశించు ఋషులలో గొందరు సూర్యకిరణరథముమీదను, మరికొందరు మనోజవమునను వేరొకకొందరు వాయుహయముల మీఁదను కొందరుయోగబలమునను విశ్వామిత్రుని సమీపించిరి.

బ్రహ్మ విశ్వామిత్రుని ధ్యానభంగ మొనర్చెను. వరదాతలయందు వసిష్ఠునిఁ గాంచి విశ్వామిత్రుఁడు మండిపడి కొంతవడి మౌనమును ధరించియుండెను. పిమ్మట ఋషులును బ్రహ్మయు విశ్వామిత్రున కిట్లు జెప్పం దొడంగిరి. "విశ్వామిత్రా! బ్రాహ్మణత్వ మతిసామాన్యమైనది. నీవు మహాభాగ్యుఁడవు. తపోధనుఁడవు. అందువలన నీవు బ్రాహ్మణుల కంటె గొప్పవాఁడవు. నీకు దృష్టమైనమంత్రమును

బ్రాహ్మణులు గాయత్రీరూపమునఁ బఠించుచు జపించుచుండవలయు నను నియమ మేర్పరచినప్పుడు నీ బ్రాహ్మణత్వమునకు లోప మేమున్నది? బ్రాహ్మణత్వమం దనేక కష్టములు గలవు. అనేకనియమములఁ బాలించవలయును. వ్రతముల ననుష్ఠించవలయును. నీవు రాజువు. కావున నీకార్యములు కష్టదాయకములు.

విశ్వామిత్రుఁడు: ఇట్టికఠోరతప మాచరించిన నేను బ్రాహ్మణవ్రతములను బాలింపఁజాలనా?

ఋషులు: పాలింపఁజాల వని మే మనుటలేదు. అంతకష్టముతోడ నీ కేమిపని యనుచున్నాము. కాని నీ వేల యింద్రత్వమునకుఁ బ్రయత్నింపవు? అది నీకు తగినపదవి. మేమందరము నీతపస్సునకు సంతుష్టచిత్తుల మైతిమి. కావున నీకు రాజర్షి యను నుపాధి నొసంగుచున్నాము. ఈయుపాధి మూడవ శ్రేణిలోనిది. బ్రహ్మర్షి దేవర్షులతర్వాత రాజర్షిపదవి యుండును. ఇఁక నీకు బ్రాహ్మణత్వముతోడ బని యేమున్నది. ఇదిగో రాజర్షిసూచక మగుసిపతికమును గైకొనుము.

విశ్వామిత్రుఁడు వారిచతురతను గ్రహించెను. తనతపమునకు బ్రహ్మర్షులు భీతిల్లుచున్నా రని తెలిసి కొనెను. అందువలన నాతఁ డాపతాకమును దూర ముగ విసరి పారవైచి యిట్లనియె. "బ్రహ్మర్షులారా! మీచతురతను గ్రహించితిని. స్తోత్రపాఠములతోడ నన్ను బ్రాహ్మణత్వమునుండి వంచించితిరి. కాని నాకిఁక బ్రాహ్మణత్వ మవసరము లేదు. బ్రహ్మత్వము గావలయును. కావున నే నిఁక తపస్సును జేయుదును. మరియొక జగత్తును నిర్మింతును. దానికి బ్రహ్మనగు దును. నాపృథ్వియందు దుఃఖము నణుమాత్రమైన నుండనీయను. బ్రాహ్మణులను దరిమివేయుదును. అప్పుడు మీ రేమిజేయుదురో చూతును.

వసిష్ఠుఁడు రహస్యముగ బ్రహ్మతోడ నిట్లనియె. "చూచినారా! బ్రాహ్మణత్వము లభింపకుండుట వలన బ్రహ్మత్వమును గోరుచున్నాఁడు."

పిమ్మట ఋషులు విశ్వామిత్రున కిట్లు జెప్పం దొడంగిరి. "విశ్వామిత్రా! నీవు దలంచినయెడల బ్రహ్మాండమును సృష్టించుట యొక లెక్కలోని పని

కాదు. కాని యెవని తపోబలమువలన బ్రహ్మాండము తల్లడిల్లుచున్నదో యట్టివాఁడు నూతన బ్రహ్మాండమును సృష్టించుటయం దాశ్చర్య మేమున్నది? కాని మేము నీస్నేహితులము. అందువలన నీకొక యుపదేశమును జేయుచున్నాము. అనవసరముగ నేలకష్టపడెదవు. ఈ బ్రహ్మాండమందు నీవద్వితీయుఁడవు. మరియు బ్రాహ్మణులకు బ్రహ్మకు నతీతుఁడవు. అట్టి నీవు సృష్టిశ్రమ నేల స్వీకరించెదవు?

విశ్వామిత్రుఁడు: బ్రాహ్మణకులమును నిర్మూలనం బొనర్పుఁడు. అప్పుడు నేను మీసృష్టియందుందును. బ్రాహ్మణులు నాకు చక్షుశ్శూలములు.

ఆమాటలు వినుచున్న బ్రహ్మ మొదలగువారు కోపమువలన కంపితశరీరులై యచ్చటనుండి బయలుదేరిరి. విశ్వామిత్రుఁడు నూతనపృథ్విని సృష్టించుటకొక్కమారు బ్రహ్మాండమును దర్శించదలఁచి హిమవత్పర్వతశిఖరములయం దత్యున్నతశిఖరమును నారోహణం బొనర్చెను.

శ్రీ

# వాల్మీకి విజయము

## నాల్గవ ప్రకరణము

---

### పదార్థాన్వేషణము.

శరత్కాలమం దాకాశము నిర్మలముగ నుండు ను. అప్పుడు దానివంకఁ జూచినయెడల, గణనాతీత మగుతారకారాజియందు, అక్కడక్కడ — అప్పుడప్పుడు—అస్పష్టశ్వేతనీహారికలను బోలినపదార్థ మేదియోయొకటి గనుపడుచుండును. ఆపదార్థమును, దూరదర్శకయంత్రమువలన, బాగుగ గాంచవచ్చును. అవియన్నియు పృథ్విగాగాని, సౌరజగత్తుగా గాని యేర్పడుటకు బ్రయత్నించుచున్న పదార్థములు. అవి చూచుటకు నీహారికలవలె గాన్పించుచుండుట వలన కొందఱు వానిని నీహారిక లని చెప్పుచుందురు.

విశ్వామిత్రుఁడు బ్రహ్మతోడను బ్రహ్మర్షుల తోడను కలహించి, ధవళగిరియొక్క ఉన్నతశిఖర మధిరోహించి యంతరిక్షమువంకఁ జూడ నాయనకు నీహారికలు గన్పడెను. వెంటనే విశ్వామిత్రుఁడు శూన్యపథమున వాని కభిముఖుఁడై బయలుదేరెను. తీవ్ర నారాచము-ధూమశకటము-విద్యుల్లతలబోలి విశ్వామిత్రుఁ డాకాశపథమున నిర్గమించుచుండెను. ముహూర్తమునకు వేలకొలఁది క్రోసులదూర మతిక్రమించుచుండెను-అతనిశరీరము తప్తకాంచనతుల్యమై ప్రకాశించుచుండ వెనుక పింగళవర్ణమున నలరారు జటాజూటము మడమల నంటుచుండెను. శరీరము సూర్యకిరణములవలన తళతళలాడుచుండెను. పృథ్వి యందలి మానవు లావిగ్రహమును పట్టపగలుగాంచి, యకాలమందలి యుల్కాపాత మని తలంచుచుండిరి.

సూర్యుఁ డస్తమించెను. గాఢాంధకారము గ్రమ్ము కొనెను. వశిష్ఠుఁ డాశ్రమమం దొంటరిగ మంత్రసాధన కుపక్రమింపఁబోవుచు, ఆకస్మికముగ నాకసమందు నిర్గమించు విశ్వామిత్రునిఁ గాంచి ధూమ

కేతు వని దలంచెను. విపత్పరంపరలు గలుగు నను శంకవలన నాతనిహృదయము కంపింపఁదొడంగెను. మహారణమం దణుమాత్రమైనను చలింపక బ్రహ్మ సభయందు లేశమైనను భయపడని వశిష్ఠుని హృద యమం దాకస్మికముగ భీతిగలిగెను.

విశ్వామిత్రుఁడు క్రమముగ వాయుపథ మతిక్ర మించి స్థిరవాయుపథమును దానిని దాటి కారణ వారిపథమును దాని నతిక్రమించి మంగళకక్షమును బ్రవేశించెను. దానిని దాటి బృహస్పతి కక్ష్యమును జేరి యచ్చటనుండి క్రమముగ సమస్త గ్రహకక్ష ముల నతిక్రమించి మరియొక సౌరజగత్తునందు బ్రవే శించెను. ఆసౌరజగత్తునందలి గ్రహములను, ఉపగ్ర హముల నతిక్రమించి తృతీయసౌరజగత్తును జేరెను. ఇట్లొక సౌరజగత్తునుండి మరియొక సౌరజగత్తున కును, దానినుండి వేరొక సౌరజగత్తునకును, సేగుచు చివరకు నివాత-నిస్తబ్ధ-నిశ్శబ్ద-నిస్సంజ్ఞ-శూన్యమయ మగు ననంతమునందుఁ బ్రవేశించెను. అది యనంత మును అనాదియు గాఢమును గంభీరమును ఆకుల

మును, అతలమును అలంఘ్యమును అపారమును ఆకృతివిహీన మగు భయంకరపారావారతుల్యముగ నుండెను. అచ్చట గ్రహనక్షత్రములు లేవు. విశ్వామిత్రుఁడు క్రమక్రమముగ గ్రహనక్షత్రములకు దూరమగుచుండెను. వెలుతురు తగ్గిపోఁజొచ్చెను. కాని విశ్వామిత్రుఁడు మానవబలమున నిర్గమించుట లేదు. ఆయన యోగబలమున నేగుచుండెను. కల్పనకు గూడ జొరవీలుగాని యాభయంకర స్థానమందు విశ్వామిత్రున కణుమాత్రమైనను భయము గలుగకుండెను. ఆయగాధ- యనంతమందు, విశ్వామిత్రుఁడు క్షీణాలోకమున నొకయలక్ష్యకేంద్రముయొక్క నలుదిక్కుల నావర్తక్రమమున అగాధ-అనంత-అసీమ - అసంఖ్య- పరమాణురాసి క్రమాగతముగ దిరుగుచుండుటనుఁ గాంచెను. మరియు నవి తనగంతవ్యనీహారిక లని దలంచి వాని సమీపమం దాగెను.

### నూతన ప్రకాశము

విశ్వామిత్రుఁడు ధ్యానబలమున నాయనంత-

అగాధ-శూన్యగర్భమందు సంఖ్యాతీతము లగు నీహారిక లున్న వని గ్రహించెను. అప్పు డాయన యోగబలమువలన నానీహారికల నాకర్షింపఁజొచ్చెను. ఆయాగతితపదార్థము లెన్ని గ్రహానక్షత్రము లాకృష్ట మగుచున్న వనువిషయమును జెప్ప నెట్లు? ప్రకాండకాయములు గలజలజంతువులు జలోన్మథనమువలన భీతి నొంది యూస్వచ్ఛ మగుజలరాశియడుగున నేదియో యొకనిరాపదస్థానమందు దాగుకొనుచుండుటను, పెద్దపెద్ద మేఘములు ప్రతికూలవాయువువలన తాడితమై యొక్క-చోట గూడుకొనుచుండుటను, విశ్వామిత్రుఁ డా స్వల్పకాంతియందు గాంచెను.

కావలసినన్ని నీహారికలు దొరికినంతనే విశ్వామిత్రుఁడు యోగబలమువలన వానినన్నిఁటిని ఒక్క-చోఁ జేర్చి దానికి ఘూర్ణగతిని గల్పించెను. ప్రతినీహారికయు తన కేంద్రమందు తిరుగఁజొచ్చెను. తిరిగి యవియన్నియు నొక్క-కేంద్రమందు దిరుగుచుండెను. అఘూర్ణగతి నిముసనిముసమునకును వృద్ధి

యగుచుండెను. క్రమముగ నవి నిముసమునకు కోటి-యర్బుదము-బృందము - ఖర్వము-నిఖర్వము - పరార్థ క్రోశములు తిరుగుచుండెను. తిరిగినకొలఁదిని పరమాణువులు పరస్పరము సమీపించి ఘనీభవించు చుండెను. అవి ఘనీభవించినకొలఁదిని వానియం దుష్ణత వృద్ధికాఁజొచ్చెను. క్రమముగ నాపరమాణు వులు మండసాగెను. అప్పు డావెల్తురునందు పరార్థ క్రోశమం దున్న నక్షత్రములుగూడ మరుగయ్యెను. మరియు గాఢాంధకారమును భేదించుకొని నూతనసృ ష్టిని తమోరాశినుండి విముక్తమొనర్చెను. చిరాంధ కారమగు ననంతగర్భగహ్వరమును ప్రకాశవంత ముగ నొనర్చి యాతేజః పరంపర నారుకోట్ల క్రోసుల దూరమందున్న వశిష్ఠునకు వర్తమానం బొసంగుటకు పరువిడుచుండెను. విశ్వామిత్రుఁ డావెల్తురు, ఆసౌర జగత్తునందలి సూర్యుఁడు, చాలు నని యనుకొనెను. కోటికల్పములకైన నాయగ్ని చల్లారదని దలంచెను.

## నూతనసృష్టి

ఆఘూర్ణ ద్వ్యమాసమును జ్వలంతమును నగు పదార్థము జ్వలించినకొన్ని నిముసములకు విశ్వామి

త్రుఁడు "బుధుఁ డగుగాక" అని యనినంతనే దాని నుండి యొకఖండము వెలుపలకు వచ్చి దూరమున కేగి తిరిగి దాని నలుదిక్కుల దిరుగసాగెను. క్రమముగ నది శీతలమై బుధగ్రహరూపమున బరిణమించెను. విశ్వామిత్రుఁ డా గ్రహమును జూచి తృప్తుఁడై "శుక్రుఁ డగుగాక" అని యనఁగనే ఆపదార్థము నుండి మరియొకఖండ మొగిరి దూరమునకు వచ్చి దానికి నలుదిశలను తిరుగసాగెను. ఆశుక్రునిఁ జూచి విశ్వామిత్రుఁడు సంతసించి 'పృథ్వి యగు గాక' అని యనెను. వెంటనే యాపదార్థమునుండి యొక ఖండము పై కెగసి నదీనదములు పర్వతములు సాగరములు మొదలగువానితోడ పృథ్వియయ్యెను. ఆపృథ్వికిని పురాతనజగత్తునకును విశేషతారతమ్యముండెను. ఇట్లాయగాధపరమాణురాశినుండి మూడుదినములలో చంద్ర-సూర్య-బృహస్పతి-మొదలగు గ్రహములును నక్షత్రములు ధూమకేతువు మొదలగువానితోడ సౌరజగ త్తేర్పడెను. కాని యీపృథ్వికంటె ఆపృథ్వి కోటిమడుంగు లెక్కుడుగ నుం

డెను. ఈసూర్యునికంటె నాసూర్యుడు కోటిగుణము లతిశయిల్లియుండెను. ఇచ్చటనుండి చూచువారికి విశ్వామిత్రుని సృష్టి బృహత్పరిమాణమున గాన్పించుచుండెను.

## నూతనజగత్తు

తృణజలవాయువులు పర్వతములు నదీనదములు వృక్షములు ఆరణ్యములు మొదలగునవన్నియు సరిగ పృథ్వియందలివానివలె నుండెను. కాని కొబ్బరిచెట్టు మాత్ర మాసృష్టియందధికము. అదివరకు కొబ్బరి చెట్టు భూమండలమందు లేదు. ఆనూతనజగత్తు నందు క్రూరజంతువులు లేవు. నేత్రపర్వం బొనర్చు పక్షులును- పృచ్ఛములును గలపశ్వు లుండెను. అచ్చటిపశువులు సుందరములై నయనానందదాయకములుగ నుండెను. వృక్షములన్నియు సుగంధపుష్ప భరితములు. మఱియు నావృక్షముల ఆకులు కాడలు కొమ్మలు రెమ్మలు పూలు ఫలములు మొదలగున వన్నియు సుగంధయుతములై యుండెను. భూమి నావరించియుండు పచ్చనిగడ్డియంతయు సుగంధయుత

మై యుండెను. అచ్చట వర్షములు ఈభూమియందు గురియువర్షములుగావు. ఎల్లప్పుడు గులాబియత్తరు వర్షించుచుండెను. వాయువు ఆవిరి షాగ మొదలగున వన్నియు సుగంధభరితములై యుండెను. అచ్చట వారు ఆహారపదార్థములకొరకు కృషిసల్పవలసిన యావశ్యకత లేకుండెను. వారికి కావలసినయాహార మును అడవులు జలము వాయువు నిచ్చుచుండెను. మరియు వానిమీఁద నాధారపడి శతసహస్రవత్స రములదనుక జీవించుటకు తగియుండెను. కాని జన సంఖ్య మిక్కిలిగ వృద్ధియైనయెడల నేమగునో చెప్ప జాలముగదా. మానవుల కిండ్లు శయనములు మొద లగువానితోడ పని లేకుండెను. ఏలయన, సుగంధ యుతమును సుస్పర్శయు అతికోమల మగుతృణము లమీఁద వారు శయనించుచుండిరి. విశ్వామిత్రుఁ డాజగత్తునందుండుపర్వతములన్నిఁటియందును సుం దరమగు గుహాల నేర్పరచెను. అందువలనమాన వులు వర్షములు గురియునప్పుడందుశయనించు చుండిరి. విశ్వామిత్రుఁడు సూర్యోత్తాపము తగులకుం

డుటకు మార్గములయందు పందిళ్లను వేయించెను. రెండుజాములప్పుడు రోడ్లమీద మంచుగడ్డలను బరపించుచుండెను. దారుణ గ్రీష్మకాలములయందు రోడ్లమీఁది కేగిన శరీరము చల్లపడుచుండెను. విశ్వామిత్రుఁడు స్వభావసౌందర్యమున కెప్పుడును బరితపించుచుండును. అందువలన పర్వతములమీఁది కెక్కుటకు మార్గము లేర్పరచెను. ప్రజలు పర్వతశిఖరములనుండి సముద్రతలమువరకును ప్రతియణువును బరిశీలించుటకు తగినయవకాశము లేర్పరచెను.

## నూతన మానవుఁడు

౯౯. మానవులు. ఆ నూతనజగత్తునందలి మానవులు నూతనముగ నుండిరి. విశ్వామిత్రునిసృష్టి యాయన చిత్తానుసారముగ నుండెను. అందువలన నాయన సృష్టియందలి మానవులందరు సుఖసంతసముల నలరారుచుండిరి. కాని వారికి దుఃఖప్రవృత్తియే లేకుండెను. అచ్చట వారిబుద్ధి వికసించుటకు తగు అవకాశముల నేర్పరచెను. "బ్రాహ్మణులు బ్రహ్మముఖమునుండి పుట్టలేదు. కేవలము మనస్సు

యొక్క నున్నతవృత్తి నభివృద్ధి నొందించుకొనుట వలన బ్రాహ్మణత్వము లభించినది. కాని స్వార్థపరత్వమువలన వారు జ్ఞానశూన్యులైరి". అని విశ్వామిత్రుని నమ్మకము. అందువలన సమస్తమానవుల బుద్ధివృత్తియు సమముగ వికసించుటకుగాను విశ్వామిత్రుఁడు తనసృష్టియందంతటను విద్యాలయములను కళాశాలలను నిర్మించెను. ఉన్నతనీతిశిక్ష శాసనశిక్ష మొదలగువానికిఁ బ్రత్యేకముగ నొందరిని మాత్రము నియమింపకుండెను. అందువలన నెల్లరును గలసి సమస్తకార్యము లొనర్చుకొనుచుండిరి. మరియు వారికందరకు "యుక్తి" యనుదానిని మాత్రమే యుపాస్యదేవతగ నొసఁగెను. అందువలన వారందరు సర్వకాలసర్వావస్థలయందు యుక్తిదేవత నారాధించుచుండిరి.

ఇఁక ప్రేమనుగూర్చి చెప్పున దేమి? ఆసృష్టిలోని వారందరు ప్రేమమయులు - మరి మానవులందరు సమానులు. ఎవఁ డేవిషయమున నున్నతిని బొందునో, వాఁడావిషయము నందరకు జెప్పి యెల్లర నావిషయ

మంచు సమానులుగఁ జేయుచుండెను. విశ్వామిత్రుని జగత్తునందలి మానవులందరు సుందరులు. నల్లనివారుగాని కురూపులుగాని యాసృష్టియందొకరద్దరైన గలరాయను విషయమున సందియము. వారి మోములు మోహినీశక్తితోడ నలరారుచుండును. అందువలన నొకరి నొకరు జూచినంతనే మోహపరవశు లగుచుండిరి. గాఢాలింగనం బొనర్చుకొనుచుండిరి. కాని నమస్కారములు సలాములు చేయు పోండు లొనర్చుకొనుట వా రెరుంగరు. వా రెప్పుడాతురులై యున్నతమార్గమున నిర్గమింపుచుండిరి. ఆనూతనజగత్తునందలి మానవులు నూతనోత్సాహముతోడ నిచ్చవచ్చినటుల దిరుగుచుండిరి. వారిలోఁగొందరు పర్వతములమీఁదికేగి వైజ్ఞానికతత్వములావిష్కార మొనర్చుచుండిరి. మఱియొకప్పుడు సముద్రగర్భమునఁ బ్రవేశించి దానియందలి గూఢతత్వములను నిర్ణయించుచుండిరి. వేరొకప్పుడు ఆకాశమార్గమున దిరుగుచు నానాకార్యములయందు మునుంగుచుండిరి. ఇట్లు వా రాత్మోన్నతికిని సమా

జ్యోన్నతికిని మనుష్యోన్నతికిని సాధనము లారయుట యం దాతురులై యుండిరి.

విశ్వామిత్రునిజగత్తునందు వివాహములేదు. ప్రణయశక్తి యత్యద్భుతము. కావున వివాహము లేకుండినను నొక్కమారు మనసు గలసినయెడల సాధారణముగ నాకలయికకు విచ్ఛేదము గలుగకుండెను. కాని యెప్పుడైన నట్లు విడివడుట సంభవించిన యెడల మూడువత్సరములు వేచియుండి పిమ్మట మరియొకరితోడ సహవాసముఁ జేయుచుండిరి. మరి యు నిట్లుఁ జేయుటను దోష మని చెప్పువా రెవ్వరు జగత్తునందు లేరు. వారందరు జితేంద్రియులు: అందువలన చౌర్యాది భయానకదోషము లణుమాత్రమైనను లేవు. సంగీతవిద్యయం దెల్లరును నారితేరి యుండిరి. ప్రతిదినమును వారందరును గలసి గీతములఁ బాడుచుండిరి. నృత్యము సల్పుచుండిరి. అభినయములఁ బట్టుచుండిరి. వాద్యయంత్రముల వాయించుచుండిరి. ఆపృథ్వియందు ప్రతిదినమును నూతనోత్సవములతోడ కాలముఁ గడచుచుండెను.

వాఁడు రాజని వీఁడు సేనానియనుభయ మెవ్వారి
కిని లేదు. వారందరు గలసి దేనిని జేసిన నది
సిద్ధాంతమగుచుండెను. ప్రతిపదార్థముయొక్క గూఢ
తత్వాన్వేషణము నొనర్చుచు ఇరుగుపొరుగువారి
మనోరంజనార్థముఁ బ్రవర్తించుటయే విశ్వామిత్రుని
సృష్టియందలి మానవుల నిత్యకర్మమై యుండెను.

ఉల్లాసము—ఆసృష్టియందలి మానవు లెప్పుడును
మనోల్లాసమున నృత్యము సల్పుచుండిరి. మన భూ
మండలమందలి మానవుల కేకారణమువలన దట్ట
మగు కలయిక కలుగకుండెనో ఆకారణములను
విశ్వామిత్రుఁడు తనసృష్టియందలి మానవులయందు
లేకుండఁజేసెను. వారిలో నెవ్వరికిని కీర్తికాముకత్వ
ముగాని ధనతృష్ణగాని యధికారవాంఛగాని లే
కుండెను. అందువలన వారెప్పుడును నామోదము
నందు మునింగి కాలము గడపుచుండిరి.

ఆపృథ్వియందలి మానవులకు చావు లేదు. కాని
వా రొకపృథ్వినుండి మరియొకపృథ్వికిమాత్ర మేగు
చుండిరి. పదునెనిమిదిలోకముల కేగి తిరిగి విశ్వా

మిత్రుని పృథ్వికి వచ్చుచుండిరి. విశ్వామిత్రుని జగత్తు నందు జననము రెండువిధములు. అం దొకటి పునరావర్తజన్మము. రెండవది నూతనజన్మము. నూతన జన్మము దినమున కొకటిమాత్రమే యుండెను. మిగిలినవన్నియు పునరావర్తజన్మలు. విశ్వామిత్రుని సృష్టి యల్పకాలముమాత్రమే యుండెను. కాని యచ్చట యధికముగ నూతనజన్మలు కలుగుచుండినయెడల నేమయ్యెడిదో చెప్పఁజాలము.

## కావ్యసృష్టి

వాల్మీకి హిమాలయపర్వతారణ్యములయందు రోదనముఁ జేయుచు దిరుగుచుండెను. ఆతనిరోదనకు గాని యంతర్దాహమునకు గాని విరామము లేదు. "అయ్యో! ఎట్టిపాపము లొనర్చితిని? నే నొనర్చిన పాపములకుఁ బ్రాయశ్చిత్త మేమి?" అని తలంచిన కొలఁదిని ఆతనిహృదయము బ్రద్దలగుచుండెను. అందువలన నొకచోటనైనను స్థిరముగ నుండఁజాలక యరణ్యమందంతటను దిరుగుచుండెను.

దొంగలగుంపునకు వాల్మీకి కనుపడలేదు. కాని

వారు వాల్మీకికొరకు తిరిగితిరిగి వేసరి తమదోవను బో మేగిరి.

వాల్మీకికి మానవునిఁ గాంచినంతనే హృదయ జ్వాలలు మిక్కుటమగుచుండెను. అందువలన నాతఁడు అరణ్యమందలి పశుపక్షులతోడ నివసింపఁ జొచ్చెను. కాని పశుపక్షులుగూడ నాయనదుఃఖ మునుఁ గాంచి దుఃఖించుచుండెను. వాల్మీకి కొన్ని పశువులకు ఆహారమును బెట్టుచుండెను. మరికొన్ని టికి మెడలు గోకుచుండెను. మరికొన్నిటికి స్నానము చేయించుచుండెను. ఈ కార్యములతోడ నాయన కాలమును గడపుచుండెను.

ఒకనా డొక క్రౌంచమిథునము వృక్షశాఖపైఁ గూర్చుండి యానందమున కేళి సల్పుచుండెను. అవి పరస్పర మొకదానిమీఁద మరియొకటి పడుచు రెక్కలువిప్పియాకొమ్మమీఁద కొంతదూరము నడ చుచు నేఁగి తిరిగి నెమ్మదినెమ్మదిగ గంతులు వేయుచు నడచుచు వచ్చి కలిసికొనుచుండెను. ఒకదాని మెడమీఁద రెండవది తనమెడను వెల్లకిలబెట్టు

చుండెను. అవి చివ్వున నెగిరి రెక్క లల్లార్చుచు రుతముఁ జేయుచు మరియొకకొమ్మమీఁది కేఁగి తిరిగి యథాస్థానమునకు వచ్చుచుండెను.

వాల్మీకి తదేకదృష్టితోడ నాక్రౌంచమిథునము యొక్క క్రీడను దిలకించుచు నిట్లనుకొనెను. "ఆహా! ఇవి నాకంటె నెంతసౌఖ్యముగ నున్నవి? నే నేల ఆమోదోన్మత్తుఁడనై విహరింపఁజాలకున్నాను. నాకు గూడ నెందరు స్నేహితులు లేరు?" ఇఁక భావింపఁ జాలకుండెను. పూర్వచరిత్రయంతియు నూతనరూపమును దాల్చి యాయనహృదయమును నాకుల బరుపఁజొచ్చెను. ఆకస్మికముగ నొకబాణము వచ్చి అందొకపక్షి ప్రాణమును గైకొనెను. ఆపక్షి క్రిందఁబడి గిరగిరతిరుగుచు కొట్టుకొని ప్రాణముల విడిచెను. అప్పు డొకవ్యాధుఁడు దానిని బట్టుకొనుటకు పరుగెత్తుకొని రాఁగ, వాల్మీకి యిట్లనియె.

ఒరే పాపాత్మా!

శ్లో. మానిషాద ప్రతిష్ఠాంత్వ మగమ శ్శాశ్వతీస్సమాః,
యత్క్రౌంచ మిథునా దేక మవధీః కామమోహితమ్.

అని యనినంతనే యచ్చటనున్న సెలయేటినుండి యొక దివ్యసుందరీమణి కాననమును వెలుఁగఁ జేయుచు వచ్చుచుండుటను వాల్మీకి చూచెను. ఆమె కాంతి యప్సరసల వినిందించుచుండెను. మఱియు నది శుభ్రజ్యోత్స్నలకంటె స్నిగ్ధముగను మందముగను మనోముగ్ధకారియునై యుండెను. ఆకామిని యొక్క కమనీయకాంతి సందర్శనమువలన నెల్ల రాశ్చర్యాన్వితచిత్తులైరి. ఆ క్రౌంచమును దీసికొనుటకు చాచినవ్యాధునిహస్త మటులనే యుండెను. పశుపక్షులు మౌనమును ధరించెను. ఆకన్యక వాల్మీకి సమ్ముఖమునకు వచ్చి నిలుచుండెను. కాని వాల్మీకికి నోటిమాట రాలేదు. మరియు నాకన్యక ఆతనికి మాట్లాడుట కవకాశ మివ్వక యిట్లనియె. వాల్మీకి! విస్మయమొందకుము. నేను సరస్వతిని. బ్రాహ్మణుల కులదేవతను. కాని నీవంటి కోమలహృదయుఁ డెవ్వఁడును బ్రాహ్మణులయందుఁ గన్పడలేదు. అందువలన నీ కీవీణ నొసంగుటకు వచ్చితిని. ఈవీణ నీయొద్దను, నీవంటివారికడను చిరకాల

ముందును గాత: నీవు పరహిత వ్రతమును బూని, కేవలము పరులకొరకు దీని నుపయోగించుము." అని వాల్మీకి సరస్వతీదేవికి సాష్టాంగదండ ప్రణామం బాచరించి యావీణను గైకొనెను. సరస్వతీదేవి యంతర్ధాన మాయెను.



శ్రీ

# వాల్మీకి విజయము

## అయిదవ ప్రకరణము



### ప్రాచీనప్రపంచము

విశ్వామిత్రుఁడు పృథ్వినుండి నూతనసృష్టి నొనర్చుట కేగుటవలన పురాతనసృష్టియం దంతటను అరాజకము సంభవించెను. దొంగతనములు దోపిడులు నరహత్యలు సర్వసాధారణము లగుటవలన నెచ్చటఁ జూచినను రక్తనదులు ప్రవహించుచుండెను. మనము దేశచరిత్రలయం దనేక యరాజక కాలములయందలి విషయములను జదివియున్నారము. అందు భారతవర్షమున యవనసామ్రాజ్యమంతరించి ఇంగ్లీషుసామ్రాజ్యము స్థాపింపఁబడువరకును సంభవించినయరాజకమందలి యత్యద్భుత

ఘోరకృత్యములు పృథ్వియం దెచ్చటను సంభవించ లేదు. కాని యవికూడ విశ్వామిత్రుఁడు భూమండల మును వీడినప్పుడు కలిగినవిపత్తునందు సహా స్రాంశ మైన నుండదు.

అప్పుడు భూమండలమందు మొత్తముమీఁద బ్రాహ్మణులు, క్షత్రియులు, వానరులు, రాక్షసు లను ప్రధానజాతులు నాలుగుండెను. యవన మ్లేచ్ఛహూణ మొదలగు దేశములను విశ్వామిత్రుఁడు భిన్నభిన్నము లుగ నొనర్చెను. ఆదేశములరాజులలో ననేకులు యుద్ధక్షేత్రములయందు హతులైరి. కొందరు పలా యనులై వశిష్ఠుని ఆశ్రయించిరి. మరికొంద రెచ్చ టకేగినదియు నెవ్వరికిని దెలియకుండెను. అందువలన నాదేశములు భయంకరమగు నరాచకము లాయెను. దొంగలు గుంపులుగుంపులుగఁ జేరి పట్టపగలే బందిపోట్లను జేయుచుండిరి. గ్రామములను నగర ములను దగులబెట్టుచుండిరి. మరియు నగరముల యందుండువారి నెల్లరను నరికివేయుచుండిరి.

వాల్మీకి దొంగలగుంపునకు నాయకత్వమును

పీడెను. కాని దొంగలు విడిపోక గుహాకచండాలుని నాయకునిగ నొనర్చుకొని హిందూస్థానమునంతయు కొల్లగొట్టసాగిరి. వారొకదినమున యమునానదీ తీరమందును, మరునాడు ప్రయాగయందును మూడవదినమున శతద్రుసంగమమందును ఆ మరుసటి రోజున సరయూ నదీతీరమందును కొల్లగొట్టుచుండిరి. ఆగుంపులను జూచునప్పుడు కలియుగము ప్రారంభమగుచున్నదా యని దోచుచుండెను. వారి యందు యవనులు-మ్లేచ్ఛులు-రాక్షసులు-బ్రాహ్మణులు-క్షత్రియులు-మొదలగువారందరు గలసి యొక్కచో భుజించుచు శయనించుచు నొక్కవ్యావసాయమందా మోదోన్మత్తులైయుండిరి. బందిపోట్లు జేయుటయు నరహత్యలొనర్చుటయు, వారి నిత్యకృత్యములాయెను. మరియు వారు మానవులకే కాక దేవతలకు గూడ నజేయులై యుండిరి.

ఆఘోరవిశృంఖుల మప్పుడేదయిన ప్రబలప్రతాపాన్వితమగు రాజ్యముగాని లేక యొకజాతిగాని ప్రాధాన్యమును వహించియుండిన యెడల దేశమునకు

శాంతి గలిగెడిది. కాని యప్పు డిట్టిజాతిగాని రాజ్యముగాని లేకుండెను. ప్రతిరాజ్యమందును రెండుకక్షులుండెను. ఒక్కజాతియందైనను నైకమత్యము లేదు. రాజశక్తి గలవారు పరమదుర్మార్గులై యుండిరి. వారి ఘోరకృత్యములకంటె దొంగల నరహత్యలు మొదలగునవి సహస్రాంశములు శ్రేష్ఠములుగనుండెను. దొంగలు మానవుల నొక్కదెబ్బతోడ నరికివేయుచుండిరి. కాని రాజశక్తిగలవారు మాత్రము మానవులను క్రమక్రమముగ తెగులంబెట్టి చంపుచుండిరి.

ఆకాలమందు రావణుఁడను నరపతి యుండెను. వాఁడు మహాపరాక్రమసంపన్నుఁడు. పరస్త్రీ పరధనముల నపహరించుటయు పరదేశముల కొల్లగొట్టుటయు పరులను పీడించుటయు వినోదార్థ మితరుల వేధించుటయు నాతనికి ముఖ్యక్రీడలై యుండెను. ఆతని కొకవిరుద్ధపక్షము గలదు. దానికి వాని తమ్ముఁడగు విభీషణుఁడు నాయకుఁడు. అందువలన రావణుఁడు విభీషణుని కారాగారమందు బంధించెను.

మఱియు విభీషణుని పక్షమున మాట్లాడిన ఒక ముఖ్యమంత్రి ముక్కు చెవులు గోయించెను. వానర రాజ్యమందలి సుగ్రీవునకును విభీషణునకును స్నేహము గలుగుననను తలంపున రావణుఁడు సుగ్రీవునకు బ్రతిపక్షమున నుండుటకు ఖరదూషణు లనుసేనానులను వానరరాజ్యమునకు బంపించెను.

వాలి వానరరాజ్యమునకు రాజు. అతఁడు తనకు విరోధు లగువారి నందరిని దేశమునుండి వెడలఁగొట్టెను. మఱియు సోదరుని భార్యతోడ సహవాసము జేయుచుండెను. వాలి యనుచరుల దౌష్ట్యమువలన గొప్పగొప్ప నగరరాజములు జనశూన్యములై యరణ్యములుగ బరిణమించెను. దండకారణ్యమని పిలువబడు దేశమొకప్పుడు సమృద్ధరాజ్యమై యుండెను. కాని నేఁడది వాలి కిరాతకృత్యములవలన నిర్జనారణ్యమై క్రూరజంతువుల కాట పట్టాయెను.

బ్రాహ్మణులయం దిరుతెగలవారుండిరి. ఇరుతెగలని యేల చెప్పవలయును? వారియం దెవ

డికి వాఁడే యధిపతియైయుండెను. కాని మొత్తము మీఁద వారిని రెండుభాగములుగ భాగింపనగును. అందొక పక్షమునకు నాయకుఁడు పరశురాముఁడు. ఆతఁడు క్షత్రియుల నామమునుగూడ లోపింపఁజేయుటకు కృతసంకల్పుఁడై యుండెను. కాని యాతనికి బ్రాహ్మణులమీఁద మితిలేని యాగ్రహము. ఏల యన, బ్రాహ్మణులందరాయన చెప్పినట్లుల వినకుండిరి. అందువలన పరశురాముఁడు సముద్రతీరమందు నివసింపఁజొచ్చెను. అప్పుడు క్షత్రియులు ప్రబలము గాఁజొచ్చిరి. అందువలన బ్రాహ్మణ క్షత్రియులను రూపుమాపుటకు పరశురాముఁడు స్థిరసంకల్పుఁడాయెను. మరియుఁ నాతఁడొక్కఁడే వేయిమంది పెట్టు. కావున బ్రాహ్మణకార్యముల యందు సంబంధమును గల్పించుకొనకుండెను. పరశురాముని యుద్దేశ్యానుసారముగ బ్రవర్తించు క్షత్రియకులాంతకులగు బ్రాహ్మణులు స్వేచ్ఛగ బ్రవర్తించుచుండిరి.

బ్రాహ్మణులలో రెండవపక్షమున కధిపతి వసి

ష్ఠుఁడు. ఆతనికి స్వపక్షమందు సంపూర్ణాధికారము లేదు. కాని కొంతవర కాతని ప్రభుత్వము సాగుచుండెను. క్షత్రియులయం దొకపక్షమువారు వసిష్ఠుని గురుత్వమును స్వీకరించుటవలన వారెప్పుడును బ్రాహ్మణక్షత్రియుల కలయిక కొరకు బ్రయత్నించుచుండిరి. ఆ ప్రయత్నమందు అయోధ్యమిథిలరాజవంశములు ప్రధానములు.

రెండవపక్షమువారు క్షత్రియాంతకుఁడగు పరశురామునిఁబోలి బ్రాహ్మణాంతకులై యుండిరి. విశ్వామిత్రునివంశము వా రాపక్షమునకు నాయకులు. వశిష్ఠుఁడు గాక మిగిలిన దళములవా రందరును పరస్పరహత్యల కణుమాత్రమైనను వెనుదీయకుండిరి. విశ్వామిత్రుని మూర్తి యజ్ఞముల నిర్మూలనం బొనర్చుట కప్పుడప్పుడు ఖరదూషణాదుల నాహ్వానించుచుండెను. మరియొకప్పు డాహ్వానింపకుండెను. అవసరమైనయెడల పరపక్షపీడనమునకు దస్యుదళముల పిలచుట కెవ్వనికిని మనోవ్యథ కలుగకుండెను. సామాన్యకారణములవలన వివాదలను పెంచుకొని

దేశముల ధ్వంసమొనర్చుకొనుటకు వెనుదీయువాఁడు లేఁడు. దాని కొక దృష్టాంతమును జూపించినఁ జాలును.

ఒక దినమున విశ్వామిత్రుని రాజధానియగు కన్యాకుబ్జమం దొక బ్రాహ్మణుఁడు గన్పడెను. మంత్రి వానినిబట్టి తెప్పించి బహుజన సమక్షమందు బెత్తము తోడ గొట్టించి కర్రలతోడ మోదించి ముక్కు చెవులు కోయించి చెవులయందు కాచిన సీసమును బోయించి వానిని కుక్కలతో గలిపి యొకబోను నందు బెట్టించెను. బ్రాహ్మణుఁ డాబాధ సహింపఁ జాలక భరద్వాజునిపై రుచ్చరించెను. భరద్వాజ ఋషి యనేకమంది శిష్యులతోడ యమునానదీతీర మున కనతిదూరమందు నివసించుచుండెను. ఆ యరణ్యభాగమున కాయనయే సర్వాధికారి. కాని యాయనకు వశిష్ఠునిపక్షమువారితో కాని పరశు రామునిపక్షమువారితోగాని యెట్టి సంబంధమును లేదు. ఆతని యుద్దేశ్యానుసారము బ్రాహ్మణుఁడు నిర్విరోధుఁడై యుండవలయును.అందువలన నాతఁడు

పౌరోహిత్యమునుగూడ స్వీకరింపకుండెను. కాని యాతనికి పౌరోహిత్య మొనర్చువారి యెడల నీర్ష్యయులేదు. అందువలన నాతనియం దెల్లరు భక్తిశ్రద్ధలు గలిగియుండిరి. మంత్రి పెట్టు బాధలవలన మరణోన్ముఖుండై యున్న బ్రాహ్మణుడు భారద్వాజునిపే రుచ్చరించినంతనే వానిని భారద్వాజుని గూఢచారి యని తలంచి మంత్రి యాబ్రాహ్మణుని మరింత ఘోరముగ హింసించి చంపెను. మరుదినము దొంగలచేత భారద్వాజుని యాశ్రమమునకు నలుదిక్కుల నగ్నిని ముట్టించెను. భారద్వాజుడును కొంతమంది శిష్యులు మాత్రము యోగబలమువలన ప్రాణరక్షణం బొనర్చుకొనంగలిగిరి. మిగిలిన యసంఖ్య ప్రాణులతోడ నా తపోవనమంతయు దగ్ధమాయెను.

## భూమండలమునందు శాంతి

వాల్మీకి సరస్వతీదేవి యొసంగిన వీణను గైకొని కవిత్వమాధురి నాస్వాదించుచు హిమాలయపర్వతారణ్యముల వీడి జనపదములకు వచ్చెను. కాని

మానవుల ఘోరకృత్యములను జూచిన కొలఁదిని ఆతనిహృదయము కరగినీరై పారఁజొచ్చెను. మానవుల దుఃఖమును గాంచి కన్నీరు గార్చిన వారిలో ప్రథముఁడు వాల్మీకియని నుడువుటకు సందియము లేదు. కాని యట్టి జలధార ఎంతమంది నేత్రముల నుండి గారుచున్నది? ఆకన్నీటి బిందువులయం దొక్కొక్కటి యొక్కొక్క యమూల్యమణి యని చెప్పవచ్చును. ఒక్కొక బిందువువలన వందలకొలఁది దౌష్ట్యము లుపశమిల్లుచుండెను. వాల్మీకి కన్నీరు గార్చుచు గానమును బాడుచు భారతవర్షమంతయు దిరిగెను. కాని భూమండలమందలి ఘోరకృత్యముల నెల్లండపవలయు ననువిషయ మాతనికి గోచరింపదయ్యె. దుష్కార్యముల గాంచి యణుమాత్రమైనను సహింపఁజాలకుండెను. ఒకదిన మాతఁడు నదీతీరమందు గూర్చుండి వీణను వాయించుచుండ కన్నీరు కాల్వలై పారసాగెను. అప్పు డాతని కాకస్మికముగ ననతిదూరమం దొక భయంకరారావము వినఁబడెను. మొదట బందిపోటుగాండ్ర

కేకలు వినబడెను. పిమ్మట ఆర్తనాద మారంభ మాయెను. ఆర్తనాదము వీనుల జొచ్చినంతనే వాల్మీకి లేచి పరుగెత్తుకొని యేగునప్పటి కొకనగరమును దొంగలు కొల్లగొట్టుచుండిరి. వీణాపాణి యగు వాల్మీకి దొంగలగుంపునందు జేరి దస్యుదళనాయకుని చేతులు బట్టుకొని 'మీ రీకార్యమును వీడుడు.' అని బ్రతిమాల జొచ్చెను.

నీకొరకు నీవేడ్చినయెడల నీరోదన మెవ్వ రాలింతురు? పరులకొరకు దుఃఖించినచో సమస్తమానవులు నీతోడ దుఃఖింతురు. ఆరోదనమందు హృదయముండినయెడల మిక్కిలిగ నేడ్తురు. వాల్మీకి రోదనము-గానము-భావము-వలన దస్యు దళపతి హృదయము గరగెను. అప్పు డాతఁడు గాయకుని వాల్మీకి యని తెలిసికొనెను. దస్యు దళపతి తాళజాలక వెంటనే దోపిడి నాపవలయు నని యాజ్ఞాపించెను. ఆతని స్వదళము మాత్రము దోపిడి మానిరి. కాని యవనులు-మ్లేచ్ఛులు-వానరులు-రాక్షసులు మాత్ర మాగక దోపిడిని జేయుచుండిరి. అందువలన దస్యు

దళపతివారి నాపుట కేగెను. ఆతను వెళ్లునప్పటికి రాక్షసులు రాజకుటుంబములోని వారి నందరను భక్షించిరి. వారినిజూచి దస్యుదళపతి దోపిడి మాను డని నుడివెను. కాని యాతని యాజ్ఞలను వినువా రెవ్వరు? వాండ్రసలే రాక్షసులు. అందుకు తోడు మద్యమును ద్రావి మత్తులై యుండిరి. కావున వాండ్రు నాయకుని యాజ్ఞను గణనచేయక చీత్కారము లొనర్పఁ జొచ్చిరి. దస్యు దళపతి బాహుబలమున వారినందరను నగరమునుండి వెడల దరిమెను. కాని వారు నగరమును వీడి యవనమ్లేచ్ఛ వానరులతోఁగూడి భీమపరాక్రమమున దస్యు శిబిరము నాక్రమించిరి. దస్యు దళపతి అతి కష్టముమీాద శిబిరమును బ్రవేశించి యచ్చటి దృశ్యమునుజూచి యాశ్చర్యాన్వితుఁ డాయెను. వాల్మీకి "అన్నా! అన్నా!" యను గానమును వీణయందుగలిపి పాడుచుండెను. ఆగానమును వినుచు దస్యు లేడ్చుచుండిరి. నరహత్యయే జీవనమును వ్యవసాయముగాగల దస్యులెల్లరు దుఃఖించుచు నస్త్రములను బరిత్యజించిరి. కాని

తమను రాక్షసులు జుట్టుకొనుచున్నా రనువిషయ మైనను వారి మనములకు స్ఫురించకుండెను. అప్పుడు రాక్షసులు ప్రబల పరాక్రమమున వారి నాక్ర మించిరి. వాల్మీకి యున్నతిస్థాయియందు గానము బాడుచుండెను. మరియు నది దయాభిక్షతోడ బూర్ణమై మానవదుఃఖముతోడ నిండియుండెను. హృదయో న్మత్తతను గల్పించుచుండెను. అందువలన రాక్షసులుగూడ మోహితులై యాగానమును వినఁ జొచ్చిరి. ఋషుపుల గానమును వినునప్పుడు వాల్మీకి యెట్టి భావముం దుండెనో అట్టి భావమే దస్యు దళమునకు గలిగెను. యవన - మ్లేచ్ఛ - రాక్షస- వానరులెల్ల రా గానమునకు మోహితులైరి. వారి హృదయములయందు దయ ప్రవహింప జొచ్చెను. వాల్మీకి యీ క్రింది యభిప్రాయము గల గానమును బాడుచుండెను. "అన్నా! ఎట్టికార్యము లొనర్చి తివి; అట్టి ఘోరకృత్యము లొనర్పఁ జనునా? ఎల్ల రు మానవులుగాదా? మీ శరీరముం దెట్టి రక్త మాంసములు గలవో సమస్త మానవులశరీరముల

యం దట్టి రక్తమాంసములు లేవా! ఇతరుల మస్త
కముమీద ఖడ్గమును బ్రయోగించునప్పుడు నీ మెడ
మీద నెవ్వరైన కత్తిని నుంచిన నెట్లుండు ననువిష
యమును యోచింపవలదా ? పరుల పిల్లలతలల
ననాయాసముగ నరికివేయుచున్నారు. కాని మీ
పిల్లలతలలు నరుకునప్పు డెట్లుండు ననువిషయమును
గమనించవలదా !" అని పాడుచుండ దస్యులెల్లరు
గొల్లున నేడ్చుచు "గురూత్తమా ? రక్షింపుము
రక్షింపుము. మాకు దారిజూపుము." అని ప్రార్థింప
వాల్మీకి యిట్లు పాడజొచ్చెను. "అన్నా ? అన్నా ."
యని బాడుడు. మానవులం దెవ్వడును పరుడు లేడు.
శీతము నీ కెట్లుండునో యందరికది యట్లనే యుండు
ను. గ్రీష్మమువలన నీశరీరమున కెట్లు చమటబట్టునో
అందరకు నటులనే చెమటబట్టును.వర్షమందు నీవెట్లు
దడియుదువో యట్లనే యందరును దడియుదురు.
కావున నీకును మిగిలిన మానవులకును భేద మేము
న్నది? అందరును గలియుడు. హృదయముల గలుపు
కొనుడు. నేను నీవాడను నీవు నావాడ వనుభావ

మునఁ బ్రవర్తించుచు. ఒక్కతృణమందే యందర మును శయనించుచున్నాము. ఒక్కపృథ్వియందే యెల్లరము నివసించుచున్నాము. ఒక్కసూర్యుఁడే యెల్లరకు వెలుతురు నిచ్చుచున్నాఁడు. ఒక్కచంద్రుఁడే యెల్లర కానందమును గలిగించుచున్నాఁడు. కావున నందరి ప్రాణ మొక్కటియేగదా!" ఆ మహాగానమందలి విషయముల వర్ణించు టెట్లు? ఆ గానము నింతకాలము పాడెనని చెప్పు టెట్లు? మరియు నా దేవగానమును నావంటివాని లేఖిని చిత్రించు టెట్లు? ఆగానమువలన వారెల్లరు దస్యువేషముల బరిత్యజించి వాల్మీకిపాదములకడ సాష్టాంగపడిరి. దస్యుదళపతి యగు గుహాక చండాలుఁడు వాల్మీకి పాదములు బట్టుకొని యేడ్వసాగెను. వాల్మీకి వారిని పాదములుముట్టవలదని నిషేధించి యిట్లనియె. "నేను దేవుఁడను గాను. దేవతను గాను. అవతారపురుషుఁడను గాను. రాజును గాను. నేనును మీవంటివాఁడను. కావున నాపాదము లంటుటవలనఁ బ్రయోజనమే మున్నది? మీ రనేక దుష్కార్యము లొనర్చియున్నారు. కాని నట్టికార్యము లికనొనర్ప మని

ప్రతినబూనుడు. మీజీవన పరివర్తనం బొనర్చుకొని సత్పథమునఁ బ్రవర్తింపుడు. అందువలన మీ కిహపరసౌఖ్యములు గలుగును. ”

అని నుడువుచుండ హతశేషు లగునగరవాసులు అరాజక రాజ్యమందుండుట యుపాయకర మని దలచి బంధువు లుండు దేశములకు పలాయను లగుచుండిరి. వారిలో కాళ్లువిరిగినవారును, కండ్లుపోయిన వారును, సగముశరీరము గాలినవా రుండిరి. కొంద రు వృద్ధులగు తలిదండ్రుల నెత్తుకొని మరికొందరు మృతప్రాయు లగుబాలకుల చంక నిడికొని పరుగిడు చుండిరి. అప్పుడు వాల్మీకి పలాయనులగుచున్న పుర వాసులఁజూపి దస్యుల కిట్లనియె. “మీకీర్తిని గాంచి నారా” అనుమాట పూర్తియైన గాకముందే కన్నీటి వలన నాతని వక్షస్థలము దడియఁ జొచ్చెను. దస్యు లెల్లరను తాపమువలనను పాపజ్ఞానమువలనను విష ణ్ణులై మృతప్రాయు లైరి. వాల్మీకి “మీరేగి వారిని మరలించుడు” అని నుడువ దస్యులు పలాయను లగుచున్న పురవాసుల సమీపించిరి. కాని వారిని

గాంచినంతనే నగరవాసు లేడ్చుచు మరింత వేగముగ బరు విడజొచ్చిరి. అప్పుడు దస్యులు "దుర్మార్గుడు సత్యమునుజెప్పినను లోకులు విశ్వసింపరు." అను విషయమును గ్రహించి వాల్మీకికడకు తిరిగివచ్చిన నగరవాసులను మరలింపుడని ప్రార్థించిరి. కాని వాల్మీకి దొంగగాడని వా రెరుంగు రెట్లు?

వాల్మీకి పలాయనులగు పురవాసులను సమీపించి 'అన్నా, అన్నా' యనుగానమునుబాడుచు స్వగృహముల కేగుడని బ్రతిమాలెను. కరుణారసమొల్కుగానమున వారిని క్షమించ బ్రార్థించెను. అందువలన వారిహృదయములు గరగి భయదూరులై స్వనగరమునకు దిరిగివచ్చిరి. మరియు వారు అరాజక రాజ్యమందుండుట భావ్యము గాదనుతలంపున వాల్మీకిని రాజుగ నుండుమనికోరిరి. కాని వాల్మీకి రాజత్వమును గైకొనక దస్యుదళపతియగు గుహుని యాదేశమునకు రాజుగ నొనర్చెను. గుహుని రాజ్యమందు మ్లెచ్ఛులు, యవనులు, వానరులు, రాక్షసులు, పరస్పరము కలహములులేక కలసి

మెలసి నివసింపఁ దొడఁగిరి. మరియు దస్యువృత్తి నామమైనను వారి తలంపునకు రాకుండెను. పరదేశముల కొల్లగొట్టవలయు ననుకోరిక వారి కణుమాత్రమైనను లేకుండెను. ఎవరైన నత్యాచార మొనర్చుటకు వచ్చినయెడల వా రందరుగలసి మహాపరాక్రమమున నా యుపద్రవమును నిర్మూలనం బొనర్చుచుండిరి. మానవమండలియందు శాంతికినివాసస్థానమగు నొకరాజ్యము స్థాపింపబడెను. కాని యారాజ్యము స్థాయిగనుండుననిగాని, అంతమంది దొంగలు పరస్పర మైత్రితోడ నెల్లప్పుడు మెలగుచుందురనిగాని, వాల్మీకికి నమ్మకము గలుగలేదు. అందువలన వాల్మీకి నెలకొకమారు గుహకరాజును దర్శించుచుండెను. మిగిలినసమయములయం దాతడు హృదయమందలి యాదేశానుసారముగ గానమును జాడుచు భారతవర్షమందంతటను దిరుగజొచ్చెను.

---

శ్రీ

# వాల్మీకి విజయము

## ఆఱవ ప్రకరణము



### కన్యాకుబ్జము

విశ్వామిత్రుడ ప్రతిహత ప్రభావమునను అపత్యానిర్విశేషముగను నూతన సృష్టియందలి ప్రజలను పాలించుచుండెను. ప్రజలసుఖ స్వాచ్ఛంద్యములు వృద్ధియై వారు పరమానందముగ జీవితమును గడుపుట కణుమాత్రమైనను కొఱంతలేకుండునటుల బ్రయత్నించుచుండెను. కాని యాతని స్వవిషయమేమి? సృష్టి చేయుచున్నంతవరకును విశ్వామిత్రునకు స్వవిషయమున దణుమాత్రమైనను చింతలేదు.

ఆతనిసృష్టికాతఁడే యీశ్వరుడు – మానవసహావాసము లేక హృదయమును విప్పి యితరులతోడ

మాట్లాడుటకు వీలులేనప్పుడు సామాన్య మాన వుడుగూడ కష్టపడును. హృదయవేదనను బొందును. విశ్వామిత్రుడు మహాపురుషుఁడు. రాజాధిరాజు. కాని యాతడు నూతనసృష్టియందు సర్వోన్నతస్థాన మధి రోహించి తనయేకత్వమును గ్రహించెను. ఆతఁడు సంకల్పించిన పనియంతయు బూర్తియయ్యెను. కాని సుఖమెచ్చట? విశ్వామిత్రుడు స్వసృష్టిమానవుల తోడ నెట్లు గలయగలడు? ఆతఁడు బహుకాల మె వ్వరితోడ దిరిగియుండెనో, ఎవ రాతని సుఖదుఃఖ ములను గ్రహించుచుండిరో, వా రిప్పుడెక్కడ? నూ తనసృష్టియందలి మానవులు నూతనులు-సుఖులు. విశ్వామిత్రుఁడు మానవుడు. కాని యాతని నొసట దుఃఖభోగమే లిఖించబడియుండెను. అందువలన నాతఁడు దుఃఖితుడాయెను. ఉన్మాదుడయ్యెను. కాని యాతని నోదార్పగలవాడెవ్వడు? ఆతని మోము వంక జూడగలవాడెవ్వడు? మిక్కిలి దుఃఖమును బొందుచుండెను. ఇట్లు కొన్నిదినములు గడచిన పిమ్మట విశ్వామిత్రుడు భూమండలమునుండి మాన

వులలో గొందరిని నూతనసృష్టికి దీసికొనిరావలయు
నని దలచెను. వెంటనే కన్యాకుబ్జనగరమును లేవ
దీసికొని వచ్చుట కొక మహానగరమును తన నూత
నసృష్టియందు నిర్మించెను. ఆసృష్టియందు శత్రువుల
భయములేదు. అందువలన నాపట్టణముచుట్టు
ప్రాకారమును గట్టించకుండెను. సురమ్యమగు హ
ర్మ్యములు ప్రకాండమగు సౌధరాజములతోడ నా
నగరము విరాజిల్లుచుండెను.

విశ్వామిత్రుడు భూమండలమునకు వచ్చెను.
స్వరాజధానియగు కన్యాకుబ్జమును బ్రవేశించి పరి
వారమును సందర్శించెను. స్వసృష్టిలోని వారికంటె
భూమండలమందలి వారు కోటిమడుంగులు సుఖులై
యున్నారని దలచి భూమండలమందే యుండ నిశ్చ
యించుకొనెను. కాని నూతనరాజ్యమందలి కర్తృ
త్వమును భూమండలమందలి కార్యవిధానమును
బ్రాహ్మణులతోడ విరోధమును మనమునకు దట్టి
నంతనే యాతడు నూతనసృష్టికి కన్యాకుబ్జ నగర
మును దీసికొని యేగుటకు బ్రయత్నించెను.

కన్యాకుబ్జ నగరమంతయు నెమ్మదిగఁ బైకిబోవు చుండెను. పృథ్వియందలి మానవు లాశ్చర్యాన్విత చిత్తులై యా యద్భుతదృశ్యమును జూచుచుండిరి. ఆనగరమందు పలువిధవాద్యములు మ్రోగుచుం డెను. ఎల్లరు నృత్యము సల్పుచుండిరి. కాని కొంత పై కేగునప్పటికి వారె సుఖము దుఃఖముగ బరిణ మించెను. గాలి లేకుండుటచేత వారికి నూపిరాడ కుండెను. అప్పుడు విశ్వామిత్రుఁడు పృథ్వినుండి గాలి నాకర్షించెను. కాని వాయు వచ్చుటకు రాదయ్యె. అందువలన నాందోళనపడుచు వాయువును సృష్టిం చుటకు బ్రయత్నించెను. కాని యా ప్రయత్నము నిష్ఫలమాయెను. అందువలన నాతడు బ్రహ్మను దలంచినంతనే యాయన వచ్చెను. బ్రహ్మనుజూచి విశ్వామిత్రుఁ డిట్లనియె. ‚‚నీ వింకను నాతోడ వివాదమొనర్ప దలచితివా ? నేను స్వజనముతోడ నాసృష్టి కేగుచున్నాను. నన్నేల యడ్డగించెదవు ?” అన బ్రహ్మ యిట్లనియె. ‚‚విశ్వామిత్రా : నూతన సృష్టిని సృజించుటవలన నీ తపోబలమంతయు క్షయ

మైనది. నీ కిక తపోబలము లేదు. కావున నిక నీ వేకార్యమును జేయఁజాలవు. నూతనకార్యము లొనర్పఁదలచినయెడల నీసృష్టి నాశన మగును. కావున నికనైన సుస్థిరచిత్తుడవు గమ్ము. జాగ్రత్తగ బ్రవర్తించుము.” అని విశ్వామిత్రుఁడు మండిపడుచు నిట్లనియె. “పాషండుడా! ఏమంటివి? చూడు నా ప్రజ్ఞ? జాగ్రత్తగ బ్రవర్తింపవలయునా? నూతన జగత్తునుండి వాయువును దీసికొనివచ్చి వీరిని దీసికొని యేగుదును.” అని యతివేగముగ విశ్వామిత్రు డటనుండి వెడలిపోయెను. అప్పు డాకాశము నుండి కన్యాకుబ్జనగరము తీవ్రగతిని క్రిందపడఁజొచ్చెను. అది యట్లు పడినయెడల స్వసృష్టినాశన మగునను దలంపున బ్రహ్మ దానిని బహుజాగ్రత్తగ క్రిందికి డింపి యథాస్థానమం దుంచెను. విశ్వామిత్రుని యనుచరవర్గము బ్రాహ్మణులను భయంకరముగ వేధింపజొచ్చిరి. రాక్షసులతో గలసి దేశము నల్లకల్లోల మొనర్పుచుండిరి.

## నూతనసృష్టి నాశనమగుట

విశ్వామిత్రుఁడు స్వసృష్టినుండి వాయువును శూన్య పథమున దీసికొని వచ్చుటకు బ్రయత్నించెను. కాని యాతని ప్రయత్నము వ్యర్థమాయెను. అందువలన నాతడు క్రోధోన్మత్తుడై బ్రహ్మను స్మరింప నాతడు వచ్చెను. బ్రహ్మనుజూచి విశ్వామిత్రుఁ డిట్లనియె. ,,నేను వాయువును శూన్యపథమున దీసికొని యేగు చున్నాను. కావున నాకు మార్గమును విడుము.'' అన బ్రహ్మ యిట్లు బ్రత్యుత్తరం బొసంగెను. ,,నీ కా తపోబలము లేదు. అందువలన నీకు మార్గ మొసంగగల శక్తి నాకు లేదు.'' అన విశ్వా మిత్రుఁడు క్రోధాంధుడై బ్రహ్మను కారాగారమందు బడవేయఁ దలచెను. కాని యా ప్రయత్నము సాగ కెట్లు. విఫల ప్రయత్నుఁడగు విశ్వామిత్రుఁడు గదనుచే ధరించి బ్రహ్మసృష్టిని లోపింపజేయ దలంచగా బ్రహ్మ యిట్లనియె. ,,ఇంతటితోడ నిలుపుము. నూతన బ్రయత్నములకు గడంగినయెడల నీ నూతనసృష్టి వినాశన మగును.'' అన విశ్వామిత్రుఁడు బ్రహ్మను

బిట్టిదరిమెను. గదను చే ధరించెను. కాని యది చేతినుండిజారి క్రిందపడెను. తిరిగి దానిని నెత్తి అతి వేగముగ ద్రిప్పసాగెను.

అందువలన నూతనసృష్టియొక్క సంధులు విడి వడుచుండెను. అతఁడు బ్రహ్మాండముయొక్క కేంద్రమును బగులగొట్టవలయు ననుదలంపున గదను తీవ్రవేగమునఁ ద్రిప్పుచు లక్ష్యమునుజూచుచుండెను. గదను ద్రిప్పినకొలదిని నూతనపృథ్వీసంధులు శిథిలమై యాసృష్టియంతయు నీహారికలుగ బరిణమించెను. అప్పుడు విశ్వామిత్రుఁడు గదను విసరివేసెను. విశ్వామిత్రుఁడు నీహారికల నేదిక్కునుండి సంగ్రహించెనో యవియన్నియు నాదిక్కునకుఁ బ్రబల వేగమునఁ బరుగిడెను. ఇదివర కెట్లు, అనంతగర్భ గహ్వరము క్షీణాలోకమున నుండెనో యదేవిధముగ నది క్షీణకాంతులతోడ నుండెను. అదివరకు నీహారికలవలన నాకర్షింపఁబడిన నక్షత్రములు మొదలగునవి స్వస్థానములయందు దిరిగి ప్రతిష్ఠితములాయెను. ఒక్క ముహూర్తకాలములో నూతన

సృష్టియంతయు జలబుద్బుదములవలె శూన్యమందు విలీన మయ్యెను. పృథ్వినుండి యూశాన్యదిక్కునఁ గన్పడు నక్షత్రరాసులు శూన్యమాయెను. విశ్వామిత్రుని సృష్టియందలిమానవుల సుఖస్వచ్ఛందములు నశించెను. వారందర గణిత పదార్థరాశియందు గలసి పోయిరి. సుందర మగుకొండలు, పర్వతములు, సౌధప్రాకారములు, రాజపథములు మొదలగువానితోడ నాపృథ్వియంతయు అగణితపదార్థరాశిగ బరిణమించెను. ఏసమాజబంధనమందు అత్యాచారములు లేవో గొప్పకొద్దియను తారతమ్యము శూన్యమో కేవలము ఐక్యము-ప్రేమ-సామ్యములతోడ నిండి యుండెనో, యదియంతయు ననంతగర్భమందు విలీనమాయెను.

## విశ్వామిత్రుని పతనము

విశ్వామిత్రుఁడు గదను వీడినంతనే మూర్ఛపోయెను. ఎచ్చట? స్థానము గలదా? శూన్యమందు బడియుండెను. ఇంతవర కాతనికి స్వసృష్టి యాకర్షణం బుండెను. కాని యాయాకర్షణము నూతన

సృష్టితోడ సంతర్హితమయ్యెను. అప్పుడు విశ్వామిత్రుడు మృతప్రాయుడు. అందువలన నాతనిని భూమి యాకర్షింపఁ జొచ్చెను. గిరగిర దిరుగుచు భూమిమీఁద బడిపోవుచుండెను. బ్రహ్మకు విశ్వామిత్రునిమీఁద మిక్కిలి ప్రేమగలదు. కావున పలుమారు తిరస్కృతుఁ డయ్యును తిరిగి విశ్వామిత్రుని కడకు వచ్చుచుండెను. విశ్వామిత్రుని బ్రాహ్మణునిగ నొనర్చుటకు బ్రయత్నించెను. వాయువు లేనియెడల విశ్వామిత్రుఁడు మరణించు నని తలఁచి బ్రహ్మ పృథ్వి నుండి వాయువును దెచ్చి విశ్వామిత్రునికడ వదలెను. అందువలన విశ్వామిత్రునకు ప్రాణవియోగము గలుగకుండెను. మూర్ఛితుఁడై యున్న విశ్వామిత్రుఁడు గిరగిరదిరుగుచు శూన్యపథమునుండి క్రిందఁ బడుచుండెను. రక్తమును గక్కుకొనుచుండెను. శరీరము బ్బెను. ఆతఁడు క్రిందఁ బడుచుండెను. కాని యెంత కాల మట్లు జారె ననువిషయ మెవ్వరు జెప్పఁగలరు ?

---

శ్రీ

# వాల్మీకివిజయము

## పడవ ప్రకరణము

### యజ్ఞము

నేడు పృథ్వియందు మహాప్రళయము సంభవించెను. ఆ ప్రళయ మాగినయెడల భూమండలమందు మానవుండను ప్రాణి జీవించియుండును. బ్రాహ్మణ జాతి నిలుచును. సృష్టినాశనము గాకుండును.

కౌశాంబనాథుడు యజ్ఞమును జేయదలంచి భూమియందును ఆకాశమందును భూమ్యాకాశ ములయందును దిరుగు సమస్త ప్రాణిబృందము నా హ్వానించెను. ఆయజ్ఞకాల మొకవత్సరము. కౌశాంబి నగరమునకు నలుదిక్కులనుండు విశాలసమతల భూమియంతయు లోకాగణ్యమాయెను. అచ్చటకు

వచ్చిన ప్రతివాఁడును నస్థిరుఁడై యుండెను. ఆయగాధ జన సముద్రమందు పొంగి పొరలుచున్న శత్రుత్వము, వైరము మొదలగునవి మహా ప్రళయమును సూచించుచుండెను. సూచనలేగాదు. ప్రయత్నములే జరుగుచుండెను.

కౌశాంబిపురాధినాథుఁడు సూర్యవంశపు నరపతి. బ్రాహ్మణపక్షపాతి. ఆతఁడు వశిష్ఠుని పురోహితునిగ నియమించుకొనెను. అందువలన కౌశాంబి నాథునిమీఁద విశ్వామిత్రుని పక్షమువారును, పరశురాముని పక్షమువారును మండిపడుచుండిరి.

విశ్వామిత్రునిమంత్రి ఖరదూషణాదులను వారిని వెంటదీసికొని వచ్చెను. మరియు ననేక దినముల నుండి ప్రబలపరాక్రమవంతులగు దస్యుదళాధిశుల ననేకుల ధనమువలన వశపరచుకొనెను. అందువలన లక్షలకొలఁది దొంగలు వచ్చి విశ్వామిత్రుని మంత్రి పక్షమునుఁ జేరిరి.

వశిష్ఠునిపక్షావలంబు లగు బ్రాహ్మణులును అయోధ్య మిథిలాపురాధీశులును యజ్ఞరక్షణార్థము

బద్ధపరికరులై యుండిరి. వశిష్ఠుని నాశ్రయించి యున్న పారద-హూన-మొదలగు జాతులవారు గూడ అస్త్రధారులై యజ్ఞరక్షణార్థము వచ్చిరి. శాంతి రాజ్యాధిపతియగు గుహుఁడు సైన్యసమేతుఁడై వచ్చెను. ఆతఁడు బ్రాహ్మణక్షత్రియుల పరస్పర కలహముల రూపుమాప నరుదెంచెను. అది సాధ్యము గాకుండిన యుద్ధము నాపవలయునని దలంచెను. అదియు సంభవము గానిచో మొదల నన్యాయముగ కయ్యమునకు కాలు దువ్వువారితోడ యుద్ధముజేయ సంసిద్ధుఁడై యుండెను.

వాల్మీకి యేడ్చుచు నటకు వచ్చిన ప్రతివాని చేతులు బట్టుకొని బ్రతిమాలుచుండెను. కాని యాయనమాట వినువాఁడెవ్వఁడు? వాల్మీకి రోదనమువలన పాషాణహృదయములుగూడ కరగి పారుచుండెను. కాని రాజనీతిజ్ఞులము ఉన్నతజాతుల వారము సభ్యజాతివారమని గర్వించుచుండు వారు మాత్రము తమ యధికారమును గాపాడుకొనుటకు ప్రియతములగు స్త్రీపుత్రుల గొంతుకలు కత్తిరించు

టకుగూడ వెనుదీయరు. అట్టివారి హృదయములు పాషాణము కంటెను కఠినతరమగు పదార్థముల వలన నిర్మితములు. కావున వారి హృదయము లెట్లు కరగును? తమ సామాన్యకార్యసాధనకొరకు లక్షలకొలంది మానవుల సర్వనాశనం బొనర్చుట కును ప్రాణములఁ దీయుటకును అణుమాత్రమైనను వెనుదీయనివారి హృదయము లెట్లు కరగును? ఆ కఠోరహృదయములు గరుగ నిమ్ము. కరుగక పోనిమ్ము. వాల్మీకి రోదనమునకు విరామము లేదు. అతఁ డొకమారు వశిష్ఠునికడ కేగుచుండెను. మరి యొకమారు ఖరదూషణాదులచేతులు బట్టుకొను చుండెను.

వాల్మీకి దుఃఖమును గాంచి సేనాసమూహము లును యజ్ఞదర్శకులును కన్నీరు గార్చుచుండిరి. కాని దయావిహీనులగు రాజనీతిజ్ఞులు మాత్రము కన్నెత్తియైనఁ జూడకుండిరి.

వశిష్ఠుఁడు వేదియం దగ్నిహోత్రమును ప్రజ్వ లింపఁజేయుఁడని యాజ్ఞాపించెను. వెంటనే యధ్వ

ర్యులు వేదిక నలంకరించిరి. అప్పుడు వాల్మీకి ధైర్య చ్యుతుఁ డాయెను. మహాప్రళయము సంభవించునని యేడ్చుచు గుహాకుని కౌఁగలించుకొని క్రింద పడి పోయెను. గుహుకుఁ డాయనకు ధైర్య మొసంగు చుండెను. యజ్ఞాగ్ని ప్రజ్వలించినంతనే రక్తము స్రవ హించునని యెల్ల రెరుంగుదురు. బ్రాహ్మణులు వేదిక నెక్కిరని విని నంతనే విశ్వామిత్రునిపక్షమువారు సమరసన్నద్ధులై వచ్చి వేదిక కొకపార్శ్వ మందు నిలచిరి. శత్రువులఁ బారదోలుటకు యాజ్ఞికదళము రెండవ పార్శ్వమందు నిలచెను. అవసరమైనయె డల నుభయుల మధ్యకు వచ్చి కలహాము నాపుటకు వీలుగ గుహుఁడు సైన్యముతోడ వారిసమ్ముఖమం దుండెను.

వాల్మీకి యేడ్చుచు వేదిమీఁది కేగి బ్రాహ్మణుల చేతియందలి యగ్నిహోత్రమును లాగి పారవైచి యజ్ఞకుండమందు గూర్చుండెను. బ్రాహ్మణులు వా ల్మీకి నచ్చటనుండి లాగి వేదిక్రిందకు దోసిరి. తిరిగి రా లేఁడు వేదిమీఁదకు రాకుండునటుల మూఁడువందల

సదస్యులు చేరి యాయన కాళ్లుచేతులు బంధించుచుం డిరి. అప్పుడు యజ్ఞశాలయందు మహాకల్లోలముబు ట్టెను. బ్రాహ్మణులు తిరిగి యగ్నిని ప్రజ్వలింపఁజేయు బ్రయత్నించిరి. అప్పు డాకస్మికముగ నొకజలబిందు వెచ్చటనుండియో వచ్చి బ్రాహ్మణులమీఁదబడెను. ఆకాశమం దణుమాత్రమైనను మేఘములు లేవు. కాని జలబిందు వెచ్చటనుండియో వచ్చిపడెను. ఆజల బిందువు పడుటవలన శుచిగలిగిన దని తలఁచి స్నాన ము జేయుట కేగిరి. అందువలన నొక ముహూర్తకా లము మహాప్రళయము బద్ధమాయెను. అప్పు డందరి హృదయములయం దొక యలౌకికభావ ముదయిం చెను. కాని ముందేమిజరుగునో యని యెల్లరును భయపడఁ జొచ్చిరి. ఒకటి రెండుముహూర్తములలో ఘోరయుద్ధము తప్పదని యనుకొనుచుండిరి.

## పశ్చాత్తాపము

విశ్వామిత్రుఁడు గిరగిరతిరుగుచు భూమిమీఁద పడుచుండెను. కాని బ్రహ్మకౌశలమువలన నాతనికి కొంచము తెలివి వచ్చెను. కాని యప్పటి యాతని

మనోభావమును మానవుఁడెట్లు లిఖించఁగలఁడు? "అయ్యో, నే నెక్కడ నున్నాను?" అని యొకమారు దలంచెను. కన్నులు దెఱచిచూచుటకు బ్రయత్నించెను. కన్నులు దెరచెను; కాని వెంటనే మూతపడెను. మూర్ఛితుండాయెను. తిరిగి తెలివివచ్చెను. కాని వెంటనే యజ్ఞాని యయ్యెను. తిరిగి జ్ఞానము కలిగి 'నే నెక్కడ కేగుచున్నాను?' అని యనుకొనెను. మరియొకమారు నరకమును సమీపించుచున్నానని తలఁచి భయకంపితుఁడై మూర్ఛిల్లెను.

తిరిగి తెలివివచ్చి నాసృష్టియెక్కడ యని తలంచెను. కాని మూర్ఛిల్లెను. తిరిగి జ్ఞానముకలిగి "నూతనసృష్టి నశించినది కావున నిఁక భూమండలమందు నివసింతును." అని తలఁచినంతనే మూర్ఛిల్లెను. తిరిగి తెలివివచ్చి "దురాకాంక్ష నాకేల కలిగినది?" ఏల గొప్పవాఁడను గావలయునని ప్రయత్నించితిని? ఏల తపస్సునకేగితిని? దిగ్విజయమునకేల గడంగితిని? వాని నన్నింటి నేల పోగొట్టుకొంటిని? నేనిప్పుడెచ్చటకేగుచున్నదియు నాకు దెలియదుగదా! మరలుటకు

శక్తిలేదుగదా ? కన్నెత్తికూడ చూడజాలకున్నాను గదా ?" అని భావించుచు విశ్వామిత్రుఁ డేడ్చెను. ఆకన్నీటిధారయే యజ్ఞశాలయందలి బ్రాహ్మణుని మీఁద బడెను.

ఆరోదనమువలన నాయన శరీరము మరింత క్షీణించెను. తిరిగి యజ్ఞాని యయ్యెను. కాని యా యజ్ఞానమందు ఋభువుల గాన మిట్లు వినబడెను. "మానవుఁడు మానవునిమీఁద నాధిపత్యము జేయ వలయునని దలంచ నంతవరకు నెల్లరు సోదరభావ మున మెలంగుచుందురు. రాజు తనవిధాయకకృత్య ములఁ దాను జేయుచున్నంతవరకును సోదరభావ మునకు గొరంతయుండదు." అను గానభావము విశ్వామిత్రునకు స్ఫురించినంతనే మనస్సునం దణఁగి యున్న దురాకాంక్ష కిఁక స్థానమీయనని ప్రతిజ్ఞ బూనెను. అప్పు డాతనికి చైతన్యము గలిగెను. ఆచేత నావస్థయందు పరహితావ్రతమునకు జీవితమును ధార బోయుదునని శపథముబట్టెను. తిరిగి మూర్ఛితుఁడై గిరగిరదిరుగుచు క్రిందబడుచుండెను.

## విజయము

బ్రాహ్మణులు స్నానముచేసి తిరిగి వచ్చి యజ్ఞశాలనుఁ బ్రవేశించిరి. మనుష్యాకారముగల గొప్పపదార్థమేదియో యొకటి యంతరిక్షమునుండి యజ్ఞాగ్నిహోత్రమున కేర్పడిన కుండములోనికి సరిగ పడుచుండెను. ఎల్లరావస్తువును తలయెత్తి చూచుచుండిరి. భయకంపితులైరి. విస్మయాభిభూతులైరి. వాల్మీకిని బంధించి కావలియున్నవా రాయనను వదలిరి. వెంటనే వాల్మీకి యొక్క పరుగున కుండముకడ కేఁగి చూడ నందొక ప్రకాండకాయుఁడగు మానవుఁడు పడియుండెను. అలౌకికశక్తివలన నామానవుని విశ్వామిత్రుఁడని గ్రహించి రోదనము చేయసాగెను. ఆతనిరోదనమునకు విరామము లేదు. ఆయన వీణ యత్యంతకరుణాస్వరమున వాడఁజొచ్చెను. కన్నీటి బిందువులవలన వక్షస్థలము భాసిల్లుచుండెను. అప్పు డాయన సదస్యులజూచి యిట్లనియె.

"మీ రతియల్పులు. సామాన్యమానవులు-చూడుడు? నూతనసృష్టిని సృష్టించిన విశ్వామిత్రుఁడు బ్రహ్మ

కంటె నున్నతస్థానమును వహించిన విశ్వామిత్రుఁడు నియతిబలమున నెట్టిస్థితికి వచ్చియున్నాఁడో కాంచుడు. ఈమహావీరునకు ఈ మహాతపస్వికి ఈ యద్భుతమానవున కెట్టి గతి కలిగినదో చూడుడు ? మీ రతిసామాన్య సుఖదుఃఖములకే పిచ్చివాండ్రగుచుందురు. కాని విశ్వామిత్రుని సృష్టి నేడు ధ్వంసమైనది. ఆయన బ్రహ్మత్వము నశించినది. సామాన్యమానవశక్తికూడ నాతని కిప్పుడు లేదు. ఇప్పు డీతఁడు మృతుఁడు. అయ్యో! విశ్వామిత్రున కెట్టి కష్టము కలిగినదో యోచించుడు. విశ్వామిత్రునివంటివానికే యిట్టిగతి పట్టినప్పుడు మీ విషయముల భావించుకొనుడు. చూడుడు. నేడు బ్రహ్మ విశ్వామిత్రునికొరకే డ్చుచున్నాఁడు. విశ్వామిత్రునివలన ననేక కష్టములొందిన వసిష్ఠుఁడు గూడ నాకులుఁడై దుఃఖించుచున్నాఁడు. కావున మీ రిఁక ద్వేషములను విరోధములను పోట్లాటలను విడనాడుడు. స్థిరచిత్తులై యుండుడు. జీవితము క్షణభంగురమని తలంచుడు.” అందరు నీరవముగ నుండి

వాల్మీకి కరుణతోఁగూడిన వీణారుణాంకారమును విను చుండిరి. ఎల్లరి హృదయములు కరగెను. అను తాపము గలిగెను. రోదనము జేయుచు నస్త్రశస్త్రములు త్యజించిరి. క్రమముగ వారిమనములు మూర్ఛ నొందెను.

క్రమక్రమముగ విశ్వామిత్రునకు తెలివి వచ్చు చుండెను. వాల్మీకి వీణానినాద మాయనకు దూరస్థ సంగీతధ్వనినిబోలి వినబడఁజొచ్చెను. కాని యాతఁడు మూర్ఛితుఁడు. అనేక దుస్స్వప్నముల గనుచుండెను. క్రమముగ నాతని శరీరము శీతలమగుచుండెను. కొంతవడికి విశ్వామిత్రుఁడు కనులు విప్పెను. వాల్మీకి గానమును బాడుచుండెను. ఆగానమందలి మృదు మందతిరస్కారములును దయాభిక్షయు విశ్వా మిత్రుని మనమందు తీవ్రశరమునుబోలి విద్ధమగు చుండెను. విశ్వామిత్రుఁడు కన్నులుదెరచి చూచు నప్పటికి సమ్ముఖమందు బ్రహ్మ యుండెను. క్రమ ముగ సమవేత జనగణమధ్యమందు బ్రహ్మ యావి ర్భూతుఁ డాయెను. ఆయనతోడ దేవర్షిగణమును

బ్రహ్మర్షి గణమునుండిరి. కస్తూరిధారల స్నానమాడు చుండిరి. విశ్వామిత్రుఁడు చేతులుజోడించుకొని క్షమించవలయు నని బ్రహ్మను ప్రార్థించుచు నేడ్వఁ జొచ్చెను. వెంటనే బ్రహ్మ యాతని కౌగిటకుఁదీసికొని ముఖచుంబనం బొనర్చి తిరిగి గాఢాలింగనం బొనర్చుకొని యిట్లనియె. "వత్సా:" నేడు నీవు బ్రాహ్మణుఁడవైతివి. అన విశ్వామిత్రుఁ డేడ్చుచు బ్రహ్మపాదములమీఁద పడెను. వాల్మీకి గానమును బాడు చుండెను. విశ్వామిత్రుఁడు బ్రహ్మ యనుగ్రహమునకు ముగ్ధుఁడై యిట్లనియె. ‹దేవా! నే నిప్పు డెచ్చటను న్నాను?' అన బ్రహ్మ యిట్లనియె. "నీ విప్పుడు భూమండలమందున్నావు. నీకష్టముల కవసాన మొనర్చితిని." అని స్వీయకమండలములోని స్వర్గీయజలమును విశ్వామిత్రునిమీఁద చల్లెను. విశ్వామిత్రుని శరీరమునకు బలమువచ్చెను. అప్పుడు విశ్వామిత్రుఁడు లేచి నిలుచుండి కనులు విప్పిచూడ సమస్త బ్రహ్మాండములు రోదనము చేయుచుండెను. అం దొక్కఁడు మాత్రము గానమును బాడుచుండెను. అప్పుడు

వసిష్ఠుఁడు పరుగెత్తుకొనివచ్చి విశ్వామిత్రునిఁ గౌగి లించుకొనెను. ఆదుర్దినమందు వశిష్ఠునకు విశ్వామిత్రునిమీఁద దయగలిగెను. విశ్వామిత్రుని బ్రాహ్మణునిఁగ నొనర్పనుభావ మాయనకు లేదు. మఱియు నాతనిహృదయము కాఠిన్యమును వీడెను. సుకోమల మయ్యెను. అందువలన స్వయముగ యజ్ఞోపవీతమును చే ధరించి మంత్రపూతమొనర్చి విశ్వామిత్రుని మెడయందు వైచి యిట్లనియె. “సోదరా! నేఁడు మనమిర్వుర మేకమైతిమి. నీవు బ్రాహ్మణుఁడవైతివి.” అని కౌఁగిలించుకొనెను. అప్పుడు విశ్వామిత్రుఁ డిట్లనియె. “బ్రహ్మర్షీ! నే నజ్ఞానమువలనను భాగ్యోన్మత్తతవలనను మిమ్మనేకవిధముల బాధించితిని. అనేకకష్టములు గలిగించితిని. అనేక దుర్భాషలాడితిని. అట్టివానిదురవస్థను గాంచి మీరు కన్నీరు విడచుచున్నారు. కాని నేనెప్పుడును మీ దుఃఖమున కొక కన్నీటిబిందువునైనను విడువలేదు. నా కనులనుండి జలబిందువులు రాలుటకిదియే ప్రథమము. దానికి మీకరుణయే కారణము.

బ్రాహ్మణుఁడు మిక్కిలి దయాళుఁడను విషయమిప్పుడు గ్రహించితిని." అని బ్రహ్మను గాంచి యిట్లనియె. "నీవు సృష్టికర్తవు. మిమ్మెన్నియో కటూక్తులాడితిని. కారాగారమందు బంధించదలఁచితిని. కాని నేఁడీవిపత్సమయమందు నాకు ప్రాణదానం బొసంగియున్నారు. మీకరుణ యపారము." అన బ్రహ్మ యిట్లనియె. "వత్సా! నీవంటి మానవుని క్షమించని యెడల నా క్షమాపణము వృథయే గదా!"

వశిష్ఠవిశ్వామిత్రులు పరస్పరము కౌఁగలించుకొనుటవలన నచ్చటనున్న బ్రాహ్మణ క్షత్రియులందరు యుద్ధవేషముల త్యజించి యొకరినొకరు గాఢాలింగనం బొనర్చుకొనఁజొచ్చిరి. ప్రతివాఁడును తన మనమందలి దురభిప్రాయమును వ్యక్తీకరించుచు క్షమింప వేఁడుకొనుచుండెను.

గుహుఁడు భయంకరయుద్ధము జరుగునను భయమున నుండెను. కాని యాశుభ పరివర్తనమును గాంచి యానందభరితుఁడై నృత్యము జేయఁ జొచ్చెను. కౌశాంబీనాథుడు ప్రథమమున మిక్కిలి విచార

గ్రస్తుఁ డాయెను. కాని యాపరిణామమును గాంచి సంతోషోన్మత్తుఁడై యజ్ఞముకొరకు భాండారమందు నిలువయుంచిన సమస్తపదార్థములను విశ్వామిత్రుని యుపనయనమహోత్సవమునకు దానము చేయ సాగెను. వాల్మీకి సంతసమును వర్ణించు టెట్లు? ఆహ్లాదమువలన నృత్యము జేయుచుండెను. 'అన్నా! అన్నా!' యను గానమును బాడుచు కనుపడిన వారి నెల్లరను గాఢాలింగనం బొనర్చుకొనుచుండెను. అంటదగినవారు అంటరానివారు బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు యవనవానరరాక్షసు లనుభేద మణుమాత్రమైనను వాల్మీకికి లేవు. చివరకు నృత్యము సేయుచు గానమును బాడుచు వచ్చి బ్రహ్మను కౌగలించుకొనెను. కాని బ్రహ్మ యని గుర్తించినంతనే కొంచెము వెరగొంద బ్రహ్మ వాల్మీకిని తిరిగి కౌగలించుకొని యిట్లనియె. "వాల్మీకి, నేడు నీదే విజయము.' వెంటనే వశిష్ఠుండు దూరము నుండి పరుగెత్తుకొనివచ్చి గాఢాలింగనం బొనర్చుకొని యిట్లనియె. "వాల్మీకి? నీదే విజయము." విశ్వా

మిత్రుఁడు కౌగిలించుకొని "వాల్మీకీ: నీదే విజయము." అనియన నలుదిక్కులనుండి "జయము. వాల్మీకికి విజయము." అను కేకలు వినబడుచుండెను. గుహుని సైన్యము బిగ్గరగ "జయము. వాల్మీకికి విజయము. జయము. వాల్మీకికి విజయము." అని కేకలువేయుచుండ దిగంతములు "జయము వాల్మీకికి విజయము." అని ప్రతిధ్వనించుచుండెను.

సూర్యుఁడ స్తమించెను. ఎల్లరు నేప్పుచు స్వగృహాభిముఖులైరి. భారతవర్షమందలి యరాజకము నశించెనని సమస్తమానవులు దలంచిరి. విశ్వామిత్రుఁడు బ్రాహ్మణుఁడై రాజ్యమును బరిత్యజించెను. ఆయన యుత్తరాధికారి కనోజరాజ్యపీఠము నలంకరించెను.

బ్రహ్మ యేగునప్పుడు ఋషిత్రయమును గాంచి యిట్లనియె. "సమస్తమానవులయం దైక్యస్థాపనం బొనర్చుటకు నారాయణుఁడు భూమండలమం దవతరింపఁబోవుచున్నాఁడు. కావున మీరాయన క్రియాప్రణాళిని నిర్ణయింపుడు." అని చెప్పి బ్రహ్మ నిర్గమించెను. ఋషులు ముగ్గురును వసిష్ఠాశ్రమమును బ్రవేశించి యోజింపఁజొచ్చిరి.



శ్రీ

# వాల్మీకి విజయము

## ఎనిమిదవ ప్రకరణము

---

### శ్రీమద్రామాయణము

శ్రీరామావతారమునకు అరువదివేల యేండ్లకు బూర్వము వసిష్ఠ విశ్వామిత్ర వాల్మీకులు శ్రీరామచంద్రుఁ డేమిచేయునను విషయమునుగూర్చి యోజించుచుండిరి. ఆయోజనము కేవలము రామాయణ రచనాకౌశలవిషయనిర్ణయము కాదు. అది జగత్తునందలి సమస్తజాతులయందునను ఐక్యమును స్థాపించుటకు జేయు ప్రయత్నమై యుండెను.

విశ్వామిత్రుఁ డనేక కార్యములు చేయ బ్రయత్నించెను. కాని ప్రతికార్యమును విఫలమాయెను. అప్పుడు మానవశక్తియొక్క యల్పత్వమును గ

హించెను. మరియు ఋషుదత్తమగు "అన్నా" యను మహామంత్రమువలన మానవులందరును సోదరులుగ నొనర్పవలయుననను ప్రబలేచ్ఛ తీవ్రముగ నుండెను.

వసిష్ఠుడు బుద్ధిబలమువలన మానవులయందైక్యమును స్థాపించుట యసంభవమని కౌశాంబి యజ్ఞమువలన దెలిసికొనెను. వసిష్ఠవిశ్వామిత్రులు వాల్మీకివిజయమును గాంచినప్పటినుండియు హృదయముతో గూడిన యైక్యమే యథార్థమగు నైక్యమని తలంచుచుండిరి. అందువలన వాల్మీకికి సహాయమొనర్చుటయే తమజీవితోద్దేశ్యమని స్థిరపరచుకొనిరి. కావున వాల్మీకిహృదయము వశిష్ఠునిబుద్ధి విశ్వామిత్రుని రాజనీతిజ్ఞత యను మూడును నొకచోజేరెను. వారుముగ్గురు జగత్తునందైక్యమును భ్రాతృభావమును స్థాపించుటకు బూనుకొనిరి.

ఆముగ్గురుఋషులు యోచించి, విషయము నిట్లు నిర్ణయించిరి. "విశ్వామిత్రుడు వశిష్ఠునకు మిత్రుండగుట వలనను బ్రాహ్మణత్వము లభ్యమగుటచేతను బ్రాహ్మణక్షత్రియులకు స్నేహము కుదిరినది. ఇక నా

యుభయజాతులకు విరోధము పొసంగదు. కాని యనేకుల మనములయం దావిషయస్మృతి యుండ వచ్చును. అందువలన ప్రకాశ్యముగ యుద్ధము జరుగకుండినను, హృదయైక్యమున కాటంకము కలుగ వచ్చును. కావున శ్రీరామచంద్రుఁడు ప్రథమమున బ్రాహ్మణక్షత్రియుల కైకమత్యమును గూర్పవలయును. భగవానుఁ డయోధ్యలో రాజవంశమందు జన్మించి మిథిలాధిపతియగు జనకుని పుత్రికను వివాహమాడవలయును. గుహునితోఁడ మైత్రిని చేయవలయును. పరశురాముని సంహారించవలయును."

కాని సంహారమునకు వాల్మీకి సమ్మతించకుండెను. అందువలన పరశురామునిదర్ప మడంచుటకు మువ్వు రంగీకరించిరి.

"శ్రీరామచంద్రుఁ డీవిధముగ ఆర్యసమాజమం దైక్యమును నెలకొల్పి అనార్యసంఘమును నేకత్రిత మొనర్పవలయును. వానరులయందు ధార్మికపక్షమువలంబించి అధార్మికులనందరను నాశనము చేయవలయును. కాని యంతమంద్రప్రాణనాశనమునకు

వాల్మీకి యంగీకరించకుండుటవలన నొకడు వాలిని సంహారించిన జాలునని సిద్ధాంతీకరించిరి. పిమ్మట రాముడు ఘోరదుర్మార్గు లగురాక్షసులను సంహారించి విభీషణునకు పట్టము గట్టవలయు ననిరి. కాని రాక్షసవధకుగూడ వాల్మీకి యంగీకరించకుండెను, విశ్వామిత్రవశిష్ఠులు" రాక్షసులు ఘోరదుర్మార్గులు. కావున వారిని సన్మార్గులుగ నొనర్చుట యసంభవ మనిరి. అందువలన రాక్షసవధ యంగీకరింపబడియె. పిమ్మట శ్రీరామచంద్రుడు సోదరత్రయముతోడ పారద మొదలగుదేశములయందు శాంతిని స్థాపించి స్వర్గారోహణం బొనర్పవలయు ననిరి." ఈవిషయ ములతోడ నవరసభరితమై యలరారు నొకమహా కావ్యమును రచించుభారమును వాల్మీకి పైనిడి వశిష్ఠు డిట్లనియె. "వాల్మీకీ ! రాముని పరమధార్మి కునిగ జిత్రించవలయును. అతనియందు పాపలేశ మైన నుండజనదు." అన విశ్వామిత్రు డిట్లనియె. "అంతే కాదు. రాముడు క్షత్రియుడుగను రాజ్యాధి పతిగ నుండవలయును. అతనియందు శౌర్య

మునురాజనీతిజ్ఞతయు ననేకముఖములఁ బ్రకాశించ వలయును.”

అప్పుడు వాల్మీకి పరమానందభరితుండై యిట్లనియె. “బ్రహ్మర్షుల యాజ్ఞను శిరస్సున ధరించుచున్నాను. శ్రీరామచంద్రుని ధార్మికునిగ నొనర్పను. వీరునిగం జేయను. రాజనీతిజ్ఞునిగఁ జిత్రింపను. కాని నే నాయనను నాదర్శమానవునిగ జిత్రించెదను. మఱియు చరిత్రను వర్ణించునప్పు డందు ఆదర్శమానవుడు-ఆదర్శరమణి- ఆదర్శదంపతులు-ఆదర్శ భ్రాత-ఆదర్శ పరివారము - ఆదర్శ బంధువు-ఆదర్శ రాజు-ఆదర్శశాసన ప్రణాళి-ఆదర్శ భృత్యుఁడు-ఆదర్శశత్రువును చూపించెదను. తా మాశీర్వదించిన యెడల శ్రీమద్రామాయణరచనకీ సుముహూర్తముననే పూనుకొందును. ఆ గ్రంథపారాయణమువలన సర్వదేశీయులును సమస్తజాతులవారును ఆనందమును బొందుదురు గాక. సదుపదేశముల గాంచెదరుగాక.”

ఈవాక్యములు విని మనములుప్పొంగ వశిష్ఠవిశ్వామిత్రు లొక్కమారు “తథాస్తు. శ్రీరామచం

ద్రుఁడు చిరకాలము మానవజాతికి ఆదర్శస్వరూపుఁడై యలరారుగాఁత" అని నుడివిరి.

అసాధారణ ప్రతిభాసంపన్నుఁడగు వాల్మీకిమహర్షి శ్రీమద్రామాయణమహాకావ్యమును రచించి వశిష్ఠవిశ్వామిత్రులకు వినిపించెను. వారు పరమానందభరితులై వాల్మీకిని సహస్రముఖములఁ గొనియాడిరి.

## శ్రీరామావతారము

శ్రీమన్నారాయణుఁడు పృథ్వియం దవతరించెను. వశిష్ఠవిశ్వామిత్రవాల్మీకుల నియమానుసారముగ శ్రీరామచంద్రుఁడు దుష్టశిక్షణమునుశిష్టపరిపాలనము నొనర్చి పృథ్వియందంతటను శాంతిని స్థాపించెను. శ్రీరామచంద్రుని పదపల్లవస్పర్శవలన భూమండలమంతయు ఫలసస్యభరిత మయ్యెను. అరణ్యములు సస్యక్షేత్రములుగ మారెను. ఎచ్చట చూచినను సుందరనగరరాజములు నిర్మింపఁబడెను. ప్రజలసుఖస్వాచ్ఛందములు క్రమక్రమముగ నభివృద్ధినొందజొచ్చెను. అప్పుడు దొంగలపేరయినను వినఁబడ

కుండెను. మఱియు మారి-స్ఫోటకము-అకాలమరణ ములు-మొదలగునవి కలలోనివార్తలయ్యె. నృత్య గీతవాద్యములతోఁగూడిన చతుష్షష్టివిద్యాచర్చల యందు జనులు నిరంతరము మునింగియుండిరి. శిల్ప మత్యున్నతస్థితికి వచ్చెను. ఎటు చూచిన నాకాశ మును చుంబించుసౌధరాజములే కన్పడుచుండెను. ఎటునడచినను శ్రుతిమధురగీతధ్వనియు వివిధవాద్య శబ్దములును వినఁబడుచుండెను. మఱియు, మల్లెలు, మొల్లలు, గులాబి, జాజిమొదలగు పుష్పములతోడ నలరారు పుష్పోద్యానములును, కొబ్బరి, మామిడి, పనస, ద్రాక్ష, ఖర్జూర, ఫలముల నిండియుండు తోఁ టలును నయనానందమును కలిగించుచుండెను. నెలకు మూఁడువర్షములు కురియుచుండుటవలన ఓదనాదులు కష్టమనుమాట నెరుంగకుండిరి. ప్రజలసంఖ్య దిన దినాభివృద్ధి నొందుచుండెను. వశిష్ఠుని సుశిక్షవలన మానవులమనము లున్నతి నొందుచుండెను. విశ్వా మిత్రుని రాజనీతివలనను, వ్యవస్థానిపుణతచేతను, కలహములు వివాదములు మొదలగునవి కలికమున

క్తైన గాన రాకుండెను. అప్పుడు వాల్మీకి యానంద మునకు మేర లేదు. ఆయన వీణానినాదమునకు విశ్రాంతిలేదు. ఆవీణానినాదము చెవుల సోకినంతనే జనులు గుంపులుగుంపులుగ వచ్చి వాల్మీకిని చుట్టు కొనుచుండిరి. అప్పు డాతనిగానముయొక్క భావము-స్వరము-క్రమక్రమముగ గాఢమును-గాఢతరమును-గాఢతమము నగుచుండెను.

సర్వత్ర నొక్క స్వరమున „అన్నా. అన్నా. మనమందరము సోదరులము.” అను భ్రాతృగీతము వినఁబడజొచ్చెను. కాని యప్పటికిని వాల్మీకిమహార్షికి పృథ్వియం దంతటను శాంతియు నైక్యమును భ్రాతృభావమును స్థాపితమైన వను విషయమునందు మిక్కిలి సందేహ ముండెను.

## శ్రీమద్రామాయణగానము

శ్రీరామచంద్రుఁడు వైకుంఠమున కేగుకాలము సమీపించెను. అందువలన శ్రీరామచంద్రుఁడు లక్ష్మణుని విడనాడి దుఃఖముతోడ సరయునదియందు

దుముకుటకు సంకల్పించుకొనెను. అప్పుడు సరయు
నది వామపార్శ్వమం దొకగొప్పసభను గూర్చెను.
బ్రాహ్మణక్షత్రియ వైశ్య శూద్రులును నిషాదచండా
లురును రాక్షసవానరులతోడ నాసభ నిండి
యుండెను. వశిష్ఠవిశ్వామిత్రులు శ్రీమద్రామాయణ
మును బ్రచార మొనర్పవలయునని వాల్మీకిని బ్రో
త్సాహ పరచిరి.

వాల్మీకి వీణను మీటుచుండెను. సుశిక్షితులగు
కుశలవులు సుకోమలబాలకంఠమున రామాయణ
మును గానము చేయుచుండిరి. ఆ గానమును
సభ్యులు మైమరచి వినుచు దుఃఖపు పట్టులయం
దందరును దుఃఖించుచుండిరి. నవ్వు వచ్చు విషయ
ములయం దందరు నవ్వుచుండిరి. ఆనందము కలి
గించు సందర్భముల విని యానందించుచుండిరి.
పూర్వలీలలు స్మరణకు వచ్చుటవలన శ్రీరామచంద్రుఁ
డొకప్పుడు హర్షమును మఱియొకప్పుడు దుఃఖమును
బొందుచుండెను. మరియు పూర్వావస్థలు నూతన
రూపమును దాల్చుటవలన శోకమోహముల ము

నుంగుచుండెను. వాల్మీకియొక్క యత్యద్భుత కవితా
నైపుణ్యమున కెల్లరు పరవశు లగుచుండిరి.

అప్పు డాకస్మికముగ ఛాయాపథము రెండు
పాయలుగ చీలెను. అందుండి పుష్పవర్షము వాల్మీకి
మీదఁ గురియఁజొచ్చెను. సభ్యులెల్ల రంతరిక్షము
వంక జూడసాగిరి. ఋభువులు కుశలవులతోడ సమ
స్వరమున శ్రీమద్రామాయణమును గానముజేయుచు
క్రిందికి వచ్చుచుండిరి. వారు భూమండలమును
సమీపించినకొలదిని వారి గానము మృదుమధుర
మగుచుండెను. ఆగాన శ్రవణమువలన ప్రజ లున్మత్తు
లైరి. ఋభువులతోడ గాన మొనర్పవలయునను
సంకల్పము వశిష్ఠ విశ్వామిత్రుల కుండెను. నేడు
వారి సంకల్పసిద్ధి యయ్యెను. అందువలన వారు
ఋభువులతోఁగూడి పరమానందముగ శ్రీమద్రామా
యణమును గానముచేయఁ జొచ్చిరి. ఋభువులు,
మానవులు, ఋషులు, ప్రేమోన్మత్తులై నృత్యము
సల్పుచు గానమును బాడుచుండిరి. శ్రీరామచంద్రుఁడు
ఆనందపరవశుఁడై వారితో గలసి గానవృత్యములు

నల్పుచుండెను. అప్పుడు బ్రహ్మా రానియెడల నాన్నృత్యమునకు విరామముండదు. ఆగానమున కంత ముండదు.

## శ్రీరామావతారసమాప్తి

అపు డాసభకు బ్రహ్మవచ్చెను. ఆతఁడు కూడ ప్రేమోన్మత్తతవలన చంచలుఁడాయెను. అట్టి స్థితి యందు నరరూపియగు నారాయణుఁడు చంచలుఁడగుటయం దాశ్చర్యమేమున్నది? బ్రహ్మ బహు కష్టముమీద తన చాంచల్య మొకింతనాపుకొని శ్రీరామచంద్రునకు వైకుంఠ ప్రయాణమును గూర్చి జ్ఞాపకమునకు దెచ్చెను. వెంటనే శ్రీరామచంద్రుఁడు ప్రజాబృందముకడ సెలవుగైకొని సరయునదియందు దుమికి పార్థివదేహమును బరిత్యజించెను. భరత లక్ష్మణ శత్రుఘ్నులుగూడ శ్రీరామచంద్రుని ననుసరించిరి. పూర్ణ బ్రహ్మము తిరోహితమయ్యెను. వృద్ధులు సరయునదియందు దేహమును వీడి ఋభువుల యందు చేరిరి. ఋభువులు మహాసమాదరమున నా నూతనఋభువులను గౌరవించిరి. మఱియు ఋ

భుభ్యందము ప్రేమభరమున "అన్నా. అన్నా!" యనుగానమును పాడసాగిరి.

## సప్తఋషులు

బ్రహ్మ వశిష్ఠమహార్షిని సప్తర్షిగణమం దుండవలయునని కోరెను. వశిష్ఠుఁడు సరయునదియందు మృణ్మయదేహమును త్యజించి జ్యోతిర్మయదేహధారణం బొనర్చి ప్రతిదినమును జగత్తుయొక్క కార్యపర్యాలోచనార్థ ముదయించుచుండెను.

## విశ్వామిత్రుఁడు

విశ్వామిత్రుఁడు దేహత్యాగమొనర్చి ఋభువులయందు ముఖ్యుడాయెను. అప్పుడాతఁడు పార్థివరాజ్యమసారమనియు, హృదయోన్నతియే సారమనియు గ్రహించెను.

## వాల్మీకి స్వర్గమును నిరాకరించుట

బ్రహ్మ వాల్మీకిని స్వర్గయాత్రకు బయలుదేరుమని నుడువ వాల్మీకి బ్రహ్మపాదములమీఁద బడి కన్నీటితోడ నాపాదములు గడుగుచు నిట్లనియె. "ఓ దేవాదిదేవా. నే నతిపాపిష్ఠుఁడను. నరాధముఁ

డను. నేనొనర్చిన ఘోరకృత్యము లనంతములు. నాకింకను తగు ప్రాయశ్చిత్తము కలుగలేదు. నే నిప్పుడు పాపపంకమందు నిమగ్నుఁడనై యున్నాను. కావున స్వర్గమునకేగి యేమిచేయుదును? నేను మానవుల హింసించితిని. తల్లడిల్లజేసితిని. మితిలేని యుపకార మొనర్చితిని. అందువలన మానవులను సుఖులుగ జేయజాలనియెడల నాపాపము లెట్లు నశించును? ఇంకను మానవులయం దభిమానము నశించలేదు- బ్రాహ్మణుఁడను-క్షత్రియుఁడను-పండితుఁడను- మూర్ఖుఁడను-ధనికుఁడను-దరిద్రుఁడను-అను నభిమాన మెల్లరను బీడించుచున్నది. అట్టి యభిమానమున్నంతవరకు మానవు లెట్లు సుఖులగుదురు? అభిమానము నశించినప్పుడు పృథ్వియంతయు స్వర్గ మగును. అప్పుడు తమయాజ్ఞానుసారము వర్తించును. కావున నన్ను క్షమించుఁడు. ఆశీర్వదించుఁడు." అనుచు రోదనము చేయఁజొచ్చెను. వాల్మీకిదుఃఖమును గాంచి బ్రహ్మ యస్థిరుఁడాయెను. ఋభువులు వాల్మీకిశిరస్సున పుష్పవృష్టిని గురిపించుచుండిరి.

## విరాట్స్వరూపసందర్శనము

బ్రహ్మాయాజ్ఞానుసారము వాల్మీకి యంతరిక్షము నంకఁ జూచెను. అప్పుడు సవితృమండలమధ్యవర్తియు, సరసిజాసనసన్నివిష్టుండును, కేయూరహారకనకకుండలకిరీటధారియు, హిరణ్మయదేహుండును శంఖచక్రగదాధారియు నగు మురారి విరాజిల్లుచుండెను. వాల్మీకి యాదివ్యసుందరవిగ్రహమును గజగజలాడుచు విలకింపఁజొచ్చెను. అప్పుడు శ్రీమన్నారాయణుండు విరాట్స్వరూపమును ధరించెను. అనేకబాహువులు-ఉదరములు-రంధ్రములు-నేత్రములు-దంష్ట్రాకరాళములుగల ననంతరూపములు వాల్మీకికిఁ గనుపడఁజొచ్చెను. కాని యారూపముల కాద్యంతములు లేవు. శశిసూర్యనేత్రముల దిగంతముల వెలుంగఁజేయుచుండు నారాయణుఁడు పృథ్వీ ఆకాశములకుమధ్య నిండియుండెను. దేవదానవయక్షరాక్షసులును, సమస్తమానవులును, జీవజంతువులును, నావిరాట్పురుషుని మోమునందు బ్రవేశించుచుండెను. ఆయన ప్రతిరోమకూపమందునను కోట్లకొ

లండ బ్రహ్మాండములు విలీన మగుచుండెను. ఆయన కడ దేవతలు కీటకతుల్యముగ గన్పడునప్పుడు మానవులఁగూర్చి చెప్పునది యేమున్నది? విరాట్పురుషుని వాల్మీకి యిట్లు స్తోత్రము జేసెను.

"నమః పురస్తా దథపృష్ఠత స్తే
నమోస్తుతే సర్వత ఏవ సర్వ
అనంతవీర్యా మిత విక్రమస్త్వం
సర్వం సమాప్నోషి తతోసి సర్వ."

బ్రహ్మ యిట్లనియె. "వాల్మీకీ! సమస్తమానవులు సమానులు-జగత్తునందు సామ్యము, భ్రాతృభావము, ఏకత్వమును స్థాపింపుము. నీ వమరుఁడవైతివి. నీకు జయమగు గాత." అన విరాట్పురుషుని ముఖగహ్వరమునుండి "జయ" మనుశబ్దము బయలుపడెను.

సంపూర్ణము.



కలోనియల్ ప్రెస్, చెన్నపురి: ౧౯౨౯.